# యువ విజేతలు





మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi
Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## యువ సముద్ర డైవర్లు

ప్రణవ్ సర్దానాకు పదేళ్లు. ఆరవతరగతి చదువుతున్నాడు. ఆయుష్ సర్దానాకు ఎనిమిదేళ్లు. ఐదవ తరగతి చదువుతున్నాడు. వీళ్లిద్దరూ సిమ్లాలోని బిషప్ కాటన్ స్కూల్ విద్యార్థులు. ప్రొఫెషనల్ అసోసియేషన్ డైవింగ్ ఇన్‌స్ట్రక్టర్స్(పిఎడిఐ) ధృవపర్చిన జూనియర్ ఓపెన్ వాటర్ డైవర్ కోర్స్ మరియు బబుల్ మేకర్ కోర్స్‌లకు అర్హత సాధించారు.

కనీసం 200 మీటర్లు ఈదగల సామర్థ్యం, 15 నిమిషాల పాటు సమాంతరంగా నీటిపై తేలియాడటం అన్నది సముద్ర డైవింగ్‌కు తప్పనిసరి షరతుల్లో ఒకటి. దీన్ని సాధించడానికి వీరిద్దరూ రెండు నెలలపాటు ఉచిత కోర్సు పూర్తి చేశారు. సాహసాలంటే మక్కువ చూపే తల్లిదండ్రులతో కలిసి ప్రణవ్, ఆయుష్‌లు డైవింగ్ సామగ్రిని తీసుకుని పోర్ట్ బ్లెయిర్ వెళ్ళి సముద్ర వాతావరణానికి అలవాటు పడ్డారు కూడా.

చిన్న వాడైన ఆయుష్ పిఎడిఐ నిబంధనల ప్రకారం ఓపెన్ సీ డైవింగ్‌కు సరిపోడు కాబట్టి అయిదు మీటర్ల లోతు (18 అడుగులు) వరకు ఈది, పిఎడిఐ ధృవీకరించిన బబుల్ మేకర్ కోర్స్‌ను పూర్తి చేశాడు. ఇక ప్రణవ్ న్యూజిలాండ్‌కి చెందిన జీన్-లుక్ పి లాయెర్ అనే శిక్షకుడి అధ్వర్యంలో అండర్ వాటర్ డ్రిల్స్ విభాగంలో పరీక్షలు పూర్తి చేశాడు.

ప్రణవ్ సముద్ర జలాల్లో జూనియర్ ఓపెన్ వాటర్ డైవింగ్ కోర్స్‌కు అర్హత సాధించి, గోవాలోని నెట్రాని ద్వీపానికి శిక్షణకు వెళ్ళాడు. చివరకు 2011 ఫిబ్రవరి 20న జూనియర్ ఓపెన్ వాటర్ కోర్స్‌కు అర్హత సాధించాడు. ఈవిధంగా ఇద్దరు సోదరులూ స్వల్ప వయసులో పిఎడిఐ సీ డైవింగ్ లైసెన్స్ కోసం అర్హత సాధించిన సోదర ద్వయంగా గుర్తింపు పొందారు.

March 2012 `20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 March 2012 Issue-03

# మార్చి 15

ఈ సామెత వెనుక ఉన్న కథ ఆసక్తికరమైంది. ఈ రోజునే జూలియస్ సీజర్ హత్యకు గురయ్యాడు. సీజర్ రోమ్ పాలకుడిగా ఉన్న కాలంలో ఒక జ్యోతిష్కుడు తనకు కలిసి మార్చి 15లోగా అతడికి పెను ప్రమాదం సంభవించనుందని హెచ్చరించాడు. తీరా మార్చి 15 రానే వచ్చింది. సీజర్ ఆ జ్యోతిష్కుడిని కలిసి మార్చి 15 వచ్చిందని కాని తానింకా బతికే ఉన్నానని చెబుతూ కొంటెగా నవ్వాడు. కాని ఆ జ్యోతిష్కుడు సీజర్‌ని హెచ్చరిస్తూ మార్చి 15 ఇంకా పూర్తి కాలేదని హెచ్చరించాడు. అదే రోజు సాయంత్రం సీజర్ ఒక నాటకం చూస్తుండగా కత్తిపోట్లకు గురై చంపబడ్డాడు....

ఈ నెల వార్షిక సెలవులకు ముందు మనం పరీక్షలకు సిద్ధమవుతుంటాము. పరీక్షలకు ముందే మనం రంగుల పండుగ జరుపుకుంటాము. ప్రహ్లాదుడు మంటల్లో నుంచి తప్పించుకోవడానికి గుర్తుగా ఆ రోజున ప్రజలు మంటలు వెలిగిస్తారు. శీతాకాలం ముగిసి వసంతకాలం రాకను హోలీ పండుగ సూచిస్తుంది. యువతీయువకులు, వృద్ధులు, ధనికులు, పేదలు అందరూ ఈ పండుగను ఆనందంగా జరుపుకుంటారు.

ఈ నెలలోనే పలు అంతర్జాతీయ దినోత్సవాలు రానున్నాయి. అంతర్జాతీయ మహిళా హక్కుల దినం, శాంతి దినం, జాతివివక్షా నిర్మూలనా దినం, ప్రపంచ జల దినోత్సవం, వాతావరణ దినోత్సవం, ప్రపంచ క్షయ వ్యతిరేక దినం, ప్రపంచ నాటకరంగ దినోత్సవం వంటివి వీటిలో కొన్ని. భారతదేశంలో టీబీ తిరిగి తన కోరలు చాచింది. ఈ వ్యాధిని మనం అదుపు చేయాలి. వీలయితే పూర్తిగా నిర్మూలించాలి.

మా కొత్త మీడియా ప్రచురణలకు మా పాఠకుల నుంచి మంచి మద్దతు లభిస్తోంది. మీ మద్దతు, ప్రోత్సాహకాలకు మా ధన్యవాదాలు. మీ ఆకాంక్షలకు అనుగుణంగా మేము పనిచేయగలమని ఆశిస్తున్నాము. మా కొత్త పుస్తకాలను మీరు చదువుతారని, మీ అభిప్రాయం మాకు తప్పక పంపాలని కోరుకుంటున్నాము. యధావిధిగా ఈ నెల కథల నిధి మీకోసం తయారవుతోంది.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

జనవరి చందమామలో వచ్చిన 'మోక్షగామి' కథ అద్భుతంగా ఉంది. కనీసం 10 లేదా 15 ఆధ్యాత్మిక పుస్తకాలు అధ్యయనం చేస్తే తప్ప మోక్షం గురించి ఇంత చక్కటి భావనను వ్యక్తీకరించడం సాధ్యం కాదు. మోక్షం అంటే అన్ని వదులుకుని వెళ్లిపోవడం అనే అర్థం కాకుండా తిరిగి జీవించి సేవ చేయడం అంటూ కథను ముగించారు. నా 65 ఏళ్ల జీవితంలో ఇంత చక్కటి కథను చూడలేదు. రమణారావు గారికి అభినందనలు.

– *ఎంవివి సత్యనారాయణ, విశాఖపట్నం*

పేరులోనే మాధుర్యం ఉన్న చందమామను అందరూ ఇష్టపడతారు. గత 63 ఏళ్లుగా చందమామ వైభవం కొనసాగుతోంది. అద్భుత వర్ణచిత్రాలతో మెరిసే చందమామ నిసర్గ సౌందర్యం నా హృదయంలో ఎప్పుడు నిలిచే ఉంటుంది.

– *రాజ శ్రీ మొరాజ్కర్, ముంబై*

సంచిక ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. గత 15 సంవత్సరాలుగా చందమామ చదువుతున్నాను. ఈ మధ్య పాఠకుల జ్ఞాపకాలు, కూడా ప్రచురిస్తున్నారు. బేతాళ కథలు, బీర్బల్, తదితర కథలు చాలా బాగున్నాయి.

– *పి. రాఘవేంద్ర, బెంగళూరు*

చందమామ నీతి కథలు ఆకట్టుకుంటున్నాయి. 'ఆస్తి పంపకం,' 'పంచతంత్రం,' 'అహంకారం,' 'నిజమైన సంపద,' 'శిథిలాలయం' వంటి కథలు చాలా బాగున్నాయి. కథలకు వేస్తున్న చిత్రాలు చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి.

– *పి. రాజలక్ష్మి ఉమాశంకర్, బెంగళూరు*

బాల్యం నుండి నా అభిమాన పత్రిక చందమామ. 1950, 60ల నాటి చందమామ సంచికలు నాకు పంపగలరా? నేను వాటికయ్యే ఖర్చులు భరిస్తాను. హిందీ చందమామలు ఉంటే మరీ మంచిది. పాత చందమామ కథలతో కలెక్టర్స్ ఎడిషన్ మీరు ప్రచురించి ఉంటే తెలుపండి.

– *నారాయణ్ లాల్ లోహర్, ఉదయ్‌పూర్, రాజస్తాన్*

ఆకాశంలో నిండు చంద్రుణ్ణి పౌర్ణమి నాడే చూస్తాము. కానీ సరస్వతీ ప్రసాదమైన చందమామను భూలోకంలో చెన్నపురి నుండి మాసం మాసం చూస్తున్నాము. ఈ మామకు క్షయము లేదు. ఇటువంటి చక్కటి కథలందిస్తున్న చందమామకు, పాఠకులకు కూడా నా ధన్యవాదములు.

– *గంగరాజు మోహనరావు, తిరునింద్రవూరు, తమిళనాడు*

తొలినుంచి ఇప్పటివరకు వచ్చిన మరాఠీ చందమామ అన్ని సంచికలూ కావాలి. ఎలా తీసుకోగలనో చెప్పండి. మరాఠీ చందమామ చందా, చిరునామా వివరాలు మరాఠీ భాషల్లోనే ప్రచురిస్తే

పాఠకులు సులభంగా అర్థం చేసుకోగలరు.

– *శాంతారాం కిసాన్ సుర్వాడే, మహారాష్ట్ర*

మీవద్ద జానపద సీరియల్స్ విచిత్ర కవలలు, పాతాళదుర్గం మొదలైనవి బౌండ్ రూపంలో దొరుకుతాయా? చందమామ మరల పునర్వైభవ దిశగా (కథల కాణాచిగా) సాగుతున్నందులకు అభినందనలు. – *మతుకుపల్లి లలిత, హైదరాబాద్*

అట్టమీద బొమ్మ బృందావనానికి గోపాలకుల వలస కథనం ఆచార్యగారి కుంచెనుండి జాలువారిన బొమ్మ అందంగా ఆకర్షణీయంగా ఉన్నాయి. కన్నకొడుక్కి గుణపాఠం నేర్పిన వీరయ్య వీలునామా మరియు నిజమైన సన్యాసి చిన్న కథలు నీతిదాయకంగా ఉన్నాయి. ఈ నెల వింతవింత సముద్రజీవుల గురించి తెలుసుకున్నాము.

– *బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్*

బృందావనానికి గోవుల వలస అట్టమీద బొమ్మ అందంగా ఆకర్షణీయంగా ఉంది. వీరయ్య వీలునామా చిన్నకథ ఎక్స్‌లెంట్. సముద్ర జీవులు బావున్నాయి.

– *భాగ్యశ్రీ రాజేష్, నిర్మల్, ఆదిలాబాద్*

వృక్షాలను ముందు చూపు లేకుండా నరకడం వల్ల సంభవించే అనర్థాలను 'సజీవ దేవుడు' కథలో చక్కగా తెలిపారు. 'సంతృప్తి' కథ, సంపాదనలో సంతృప్తిని సమయస్ఫూర్తితో పాటించాలని సూచించింది. పంచతంత్ర కథలు అద్భుతంగా ఉంటున్నాయి. లోకంలో ఎన్నో సందర్భాలలో విమర్శించేవారికి కనువిప్పు కలిగించే నీతి కథ 'విమర్శ'. 'రుజువు' కథ మూఢనమ్మకాలు వద్దని బాగా చెప్పింది.

– *జె. సుధాకర్ పట్నాయక్, కాకినాడ, తూ.గో. జిల్లా*

చందమామతో ఉన్న అనుబంధం 50 ఏళ్లు పైబడి కొనసాగుతూనే ఉంది. చందమామ చదవటం మరపురానిది, మధురమైనది. చందమామకు హైలెట్ అనదగిన ఫోటో వ్యాఖ్యల పోటీని తిరిగి కొనసాగించాలని మనవి.

– *లక్ష్మి, నిజామాబాద్*


Statement about Ownership of
**CHANDAMAMA (Telugu)**
Rule 8 (Form VI), Newspaper (Central) Rules, 1956

1. **Place of Publication:**
   Chandamama India Ltd.,
   B-3, Cross Road 'B', MIDC,
   Andheri (East), Mumbai-400093.
2. **Periodicity of Publication:**
   MONTHLY
   1st of each calendar month
3. **Printer's Name:**
   Prashant Sharad Mulekar
   **Nationality :**
   Indian
   **Address:**
   Chandamama India Ltd.,
   B-3, Cross Road 'B', MIDC,
   Andheri (East), Mumbai-400093.
4. **Publisher Name :**
   Prashant Sharad Mulekar
   **Nationality:**
   Indian
   **Address:**
   Chandamama India Ltd.,
   B-3, Cross Road 'B', MIDC,
   Andheri (East), Mumbai-400093.
5. **Editor's Name :**
   Prashant Sharad Mulekar
   **Nationality :**
   Indian
   **Address :**
   Chandamama India Ltd.,
   B-3, Cross Road 'B', MIDC,
   Andheri (East), Mumbai-400093.
6. **Name and address of Individuals who own the newspaper :**
   Chandamama India Ltd.,
   Board of Directors:
   1. Prashant Sharad Mulekar
   2. Kiran Kulkarni
   3. Salim Govani
   B-3, Cross Road 'B', MIDC,
   Andheri (East), Mumbai-400093.

I **Prashant Sharad Mulekar**, do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd,) **Prashant Sharad Mulekar**
Publisher

1st March 2012



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........

Date of Birth: .......... Sex : ..........

Address: ..........

..........

..........

.......... City: ..........

State: .......... Pin: ..........

Telephone: ..........

Mobile: ..........

Email: ..........

Subscription Number (for renewals): ..........

Gift Subscription to the following address:

..........

..........

..........

..........

Enclosed Cheque/DD* for Rupees ..........

Cheque/DD No ..........

favouring Chandamama India Ltd on ..........

.......... bank.

* Your subscription will commence in 6 weeks.

Please mail the subscription form to:

**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| English (₹25/- per copy) | ₹300 | ₹540 $60 | ₹765 $135 | ₹960 $240 | ₹1125 $375 |
| REGIONAL (₹20/- per copy) | ₹240 | ₹430 $50 | ₹610 $110 | ₹770 $190 | ₹900 $300 |
| JUNIOR (₹15/- per copy) | ₹180 | ₹325 $35 | ₹460 $80 | ₹575 $145 | ₹675 $255 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

## చందమామతో నా జ్ఞాపకాలు – ఒరియా

పద్నాలుగేళ్ల వయసులో నేను 9వ తరగతి చదువుతూ ఉండేవాడిని. మా మామయ్య ఇల్లు సమీపంలోని గ్రామంలో ఉండేది. ఒక రూపాయి ధర ఉన్న జాహ్నామాము(చందమామ)ను మామయ్య పోస్ట్ ద్వారా పొందేవాడు. ప్రతినెలా మామయ్య నుంచి ఆ పుస్తకం తీసుకునేవాడిని. అద్భుతమైన రంగుల చిత్రాలు, నీతి కథలతో ఆకర్షణీయంగా ఉండే జాహ్నామామును పూర్తిగా చదివి మళ్లీ మా మామయ్యకు ఇచ్చేసేవాడిని. పత్రికను చదవడానికి ప్రతి నెలా మామయ్య ఇంటికి పిచ్చిగా పరుగెత్తేవాడిని. పత్రిక చెన్నయ్‌లో ప్రచురించబడేదని నాకు అప్పట్లో తెలియదు.

ఒకసారి ఆ పుస్తకాన్ని చదివి ఇచ్చేశాక, దాంట్లోని చిత్రాలను మళ్లీ చూడాలని, కథలు మరోసారి చదవాలని ఎన్నోసార్లు భావించేవాడిని కాని ఆ పుస్తకం మళ్లీ నాకు దక్కేది కాదు.



Dr. Surendra natha Tripathy, Lecturer, Debagarh (Odissa).

ఇలా సంవత్సరం గడిచింది. చివరికి నేను 12 రూపాయలు కూడబెట్టి, సంవత్సరం చందాకోసం దాన్ని చందమామ కార్యాలయానికి ఎం.ఒ చేశాను. మరుసటి నెల సంచికను మేం మునుపటి నెల మూడవ వారంలోనే అందుకునేవాళ్లం. జాహ్నామాము పై విపరీతమైన ఆసక్తితో నేను పోస్ట్ బ్యాగ్‌ను తెరిచే క్షణాల కోసం వేచి ఉండేవాడిని. తపాలా పెట్టెలో జాహ్నామాము కనబడగానే వెంటనే పత్రికను లాక్కునేవాడిని. జాహ్నామాముకు 15 సంవత్సరాలపాటు చందా కట్టాను. 1975లో నేను జాహ్నామాములతో ఒక లైబ్రరీ ప్రారంభించాను. ఇప్పుడీ గ్రంధాలయంలో పదివేల పుస్తకాలు ఉన్నాయి. ఈనాటికి నేను జాహ్నామామును చదువుతూనే ఉన్నాను. జాహ్నామాము అంటే నాకు ప్రాణం.

## చందమామతో నా జ్ఞాపకాలు – తెలుగు



Dr.Prof. Kakarla Subbarao Bone Radiologist, Hyderabad.

నేను వైద్య విద్యార్థిగా ఉన్నప్పుడు సెలవుల్లో మా ఊరికి వెళ్లేవాడిని. అక్కడ చందమామ పత్రికను చూసి అబ్బురపడ్డాను. మా బాబాయికి చందమామ అంటే చాలా ఇష్టం. గ్రామ గ్రంథాలయానికి ఆయన చందమామను ఇచ్చేవాడు. చందమామలో బేతాళ కథలు అంటే నేను చెవి కోసుకునేవాడిని. కాని తొలి పేజీనుంచి వెనుక పేజీ వరకు మొత్తం సంచికను తిరగేసి చదివేవాడిని. చందమామలో భారతీయ సంస్కృతీ సంప్రదాయాల గురించిన రచనలు ఉండేవి. అలాగే గొప్ప నైతిక విలువలను బోధించే పౌరాణిక కథలు కూడా ఉండేవి.

శ్రీ బి. నాగిరెడ్డి గారు 1975లో న్యూయార్క్ సందర్శించారు. న్యూయార్క్ తెలుగు లిటరరీ, కల్చరల్ అసోసియేషన్ ఆయనను సత్కరించింది. ఆ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ చందమామ వివరాలు తెలిపారు. మేము న్యూయార్క్‌లో నివసిస్తున్నప్పుడు నా జీవన సహచరి న్యూయార్క్ హిందూ దేవాలయంలో ఒక చిన్న తెలుగు గ్రంథాలయాన్ని ప్రారంభించింది. ఆదివారం తెలుగు పిల్లలకు మేము తరగతులు ప్రారంభించాము. సహజంగానే ప్రతి ఒక్కరూ చందమామకోసం అడిగేవారు. దాంతో చందమామకు చందా కట్టాము. చాలీచాలని నిధులతో 1947లో పిల్లల పత్రికను ప్రారంభించాలనుకోవడమే ఒక సాహసం. గ్రామీణ సంస్కృతి, వర్ణచిత్రాలను చక్కగా చూపించే సరదా కథలతో కూడిన విస్తృత సమాచారాన్ని చందమామ అందించేది. ఇప్పుడు కూడా చందమామ పలు భారతీయ భాషలలో వస్తున్నప్పటికీ ఇంగ్లీష్ చందమామ అమెరికాలో ప్రజాదరణ పొందుతోంది. ఎందుకంటే అనేకమంది భారతీయులు అమెరికాలో శాశ్వత నివాసం ఏర్పర్చుకున్నారు.

## చందమామతో నా జ్ఞాపకాలు – మలయాళం

నేను ఏడవ తరగతిలో ఉన్నప్పుడు అంటే 1962లో అంబులి అమ్మావన్ *(చందమామ)* చదవడం మొదలెట్టాను. అనుకోకుండా మా బంధువుల ఇంట్లో దాన్ని చూసాను. కాని మా



O.G. Gopinathan Nair,
Kakkanad, Kerala.

అమ్మా నాన్నలు దాన్ని కొనడానికి అప్పట్లో ఆసక్తి చూపేవారు కాదు. అప్పట్లో పత్రికలో ఫోటో వ్యాఖ్యల పోటీ అంటే నాకు చాలా ఇష్టంగా ఉండేది. పత్రికను మళ్ళీ 1970 డిసెంబర్‌లోనే చూశాను. ఆనాటి నుంచి అన్ని సంచికలను నేను భద్రపరుస్తున్నాను. నా పిల్లలు కూడా అంబులి అమ్మావన్ సంచికలను చదువుతూ సంతోషిస్తుంటారు. ఈ మధ్య నేను మా అల్మైరా తెరిచి చూసినప్పుడు చెదపురుగులు నేను దాచి ఉంచిన పాత చందమామలను అన్నింటినీ తినేసి ఉండడం చూసి చాలా బాధపడ్డాను. అంబులి అమ్మావన్ కథలు వైవిధ్యపూరితంగా ఉండి పాఠకులపై పన్నీటి జల్లు కురిపించేవి. ఈ కథలు పాఠకులలో దృఢనిశ్చయాన్ని, ఆశావాదాన్ని ప్రేరేపించేవి. లాభాలు పెద్దగా ఆశించకుండా పిల్లల పత్రికను ప్రారంభించడానికి శ్రీ నాగిరెడ్డి, శ్రీ చక్రపాణి చూపిన చిత్తశుద్ధి, అంకిత భావానికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

గత ఆరున్నర దశాబ్దాలుగా అంబులి అమ్మావన్ తన పాఠకుల హృదయాల్లో విశిష్ట స్థానం సంపాదించుకుంది. ఇది ఓ కథల జలనిధి. భారతీయ సంస్కృతీ సంప్రదాయాల గురించి జ్ఞానం సంపాదించడంలో నూతన తరాల పిల్లలకు అంబులి అమ్మావన్‌ను పోలిన పుస్తకాలు చాలా తక్కువగానే అందుబాటులో ఉన్నాయి. నా ప్రియమైన అంబులి అమ్మావన్‌కు సకల విధాలా శుభం చేకూరాలని కోరుకుంటున్నాను. నేటి ఐటి ప్రపంచం, ఎలెక్ట్రానిక్ మీడియాలు పెను సవాళ్లు విసురుతున్నప్పటికీ అంబులి అమ్మావన్ చిరకాలం వర్ధిల్లాలని ప్రార్థిస్తున్నాను.





# న్యాయమైన తీర్పు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటి లాగానే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! నువ్వు ఈ అర్ధరాత్రి వేళ ఏ ప్రయోజనం ఆశించి సంచరిస్తున్నావో నాకు బోధపడటం లేదు. బహుశా ఎవరికైనా న్యాయం చేయడానికి ఈ పనికి పూనుకున్నావేమో! అయితే కొందరు వ్యక్తులు ఇతరులకు న్యాయం చేసే సమయాన ఒకరకం గానూ, తమవారికి న్యాయం చేసే సమయాన మరొకరకం గాను వ్యవహరిస్తారు. వీరిలో నీవు ఏ కోవకు చెందినవాడివో ఆత్మపరిశీలన చేసుకోవడానికి వీలుగా, పూర్వం అక్క మయూఖుడు అనే రాజు పరులపైనా,



తనవారిపైనా తీర్పు చెప్పే సమయాన ఏ రకంగా ప్రవర్తించాడో చెబుతాను. శ్రమ తెలియకుండా విను!' అంటూ ఇలా చెప్పసాగాడు.

శిఖరపురి రాజ్యం రాజు అక్కమ యూఖుడు ధర్మనిరతుడు, న్యాయకో విదుడు. తీర్పులు చెప్పడంలో అతనికి అతనే సాటి అని రాజ్య ప్రజలే కాదు.. పొరుగు రాజ్యాల వారు కూడా చెప్పుకు నేవారు....

అంతేకాదు రాజ్యపాలనా, క్లిష్టమైన విషయాల్లో తీర్పు చెప్పేటప్పుడు సాటి దేశాల రాజులు అక్కమయూఖుడిని సంప్రతించి తగిన సలహాలు తీసుకునే వారు.

ఒక పర్యాయం అక్కమయూఖుడు సభ తీర్చి ఉండగా, ఇద్దరు వ్యక్తులు తీర్పుకోసం అతని సమక్షానికి వచ్చారు. వారిలో ఒకరు వణిక్ప్రముఖుడు రత్న విభూషితుడు కాగా, రెండో వ్యక్తి కాల రుద్రుడనే దొంగ.

అక్కమయూఖుడు వారి వంక చూసి, 'మీ సమస్య ఏమిటో విశదీకరించండి,' అన్నాడు. అప్పుడు కాలరుద్రుడు, 'రాజా నేనొక దొంగను. ఈ వ్యాపారి ఇంట్లో దొంగ తనం చేస్తూ దొరికిపోయాను. ప్రతిగా అతడు నన్ను శిక్షిస్తాడని భావిస్తే, అత నేమో నాకు తన ఇంటనే నౌకరు ఉద్యోగ మిచ్చి ఆదరించబోయాడు. అది నాకు చాలా ఇబ్బంది కలిగించింది. నాదసలే దొంగబుద్ధి. ఆదరించిన వ్యక్తి ఇంటనే మరలా దొంగతనం చేస్తే మరి నాకు పుట్టు గతులు ఉండవు. అందుకే తమరు విచారించి నాకు తగిన శిక్ష విధించండి,' అని కోరాడు.

అప్పుడు రత్న విభూషితుడు, 'మహా రాజా! నేను ఈ దొంగ గతం గురించి అతని నోటనే విన్నాను. అతడు పేదరికం వలననే దొంగతనాలు చేస్తున్నాడని తెలు సుకుని పని ఇవ్వబోయాను. అందుకే అతను ఇంతగా మథన పడుతున్నాడు. నా ఈ చర్య సరైనదో, కాదో ప్రభువులు మీరే తీర్పు చెప్పాలి,' అని కోరాడు.

అక్క మయూఖుడు, దొంగతో, 'నీవు చేసిన తప్పుకు ప్రాయశ్చితంగా ఒక ఏడాది పాటు ఈ వ్యాపారి ఇంటనే జీతం లేకుండా పనిచేయి. అదే నీకు తగిన శిక్ష. ఏడాది తరవాత అతనిచ్చే జీతంతో నీతిగా బతుకు,' అని తీర్పు చెప్పాడు.

మహారాజు తీర్పుకు అందరూ కర తాళ ధ్వనులు చేశారు.

మరొక పర్యాయం అక్కమయూ ఖుడు సభ తీర్చి ఉండగా భటులు ఇద్దరు వ్యక్తులను అతని సమక్షానికి తెచ్చారు.

వారిలో ఒకడు సంకెళ్లతో బంధించ బడి ఉండగా, మరో వ్యక్తి కంటినుంచి రక్తం స్రవిస్తూ కనిపించాడు.

అతడు రాజుతో, 'మహారాజా, నా పేరు నిరంజనుడు. నేను మీ గూఢచారి దళంలో పనిచేస్తున్నాను. వీడు గండర భీముడు అనే గజదొంగ. అడివి గుండా ప్రయాణిస్తున్న వారిని వీడు నిలువునా దోచుకుంటూ, ఎదురు తిరిగిన వారిని దారుణంగా గాయపరుస్తున్నాడు.

నేను వీడి మీద ప్రత్యేకంగా నిఘా వేసి బంధించబోయాను. అంతలో వీడి అనుచరులు నన్ను బంధించారు. వీడు నిర్దాక్షిణ్యంగా చురికతో నా కన్ను పెరికి వేశాడు. ఈలోపు మన రాజభటులు రావ డంతో వీడు ఎట్టకేలకు దొరికిపోయాడు. ఈ గజదొంగను కనికరం చూపకుండా కఠినంగా శిక్షించండి,' అని కోరాడు.





అప్పుడు గండరభీముడు, 'రాజా! నేను ఇతగాడిని అటకాయించలేదు. దోచుకునే ప్రయత్నమూ చేయలేదు. ఇతనే నన్ను బంధించబోయాడు. ఆత్మ రక్షణార్థం నేను ప్రతిఘటించడంలో ఇతని కంటికి గాయమయింది. అందులో నా తప్పేమీ లేదు. ధర్మప్రభువులు స్వయంగా మీరే న్యాయం చెప్పాలి.' అని విన్నవించాడు.

అక్కమయూఖుడు 'కంటికి కన్ను అన్న సంప్రదాయాన్ని అనుసరించి ఈ బందిపోటు ఒక కంటిని తీసేయండి,' అని నిరంజనుడిని ఆదేశించాడు.

మహారాజు తీర్పును ఆమోదిస్తూ సభికులు హర్షధ్వానాలు చేశారు.

కొంతకాలం గడిచాక, ఒకరోజు అక్కమయూఖుడు నిండుసభలో ఉండగా, అగ్నిహోత్రుడు అనే పండితుడు కలిశాడు. అతనితో కూడా కుడిచేయి లేని ఒక యువకుడు ఉన్నాడు.

అగ్నిహోత్రుడు, అక్కమయూఖుడితో 'రాజా, వీడు నా కుమారుడు. పేరు నీలకంఠుడు. మీ కుమారుడు అభిషిక్తుడూ నా కుమారుడు నీలకంఠుడూ గురుకులంలో సహాధ్యాయులు. ఖడ్గచాలనం అభ్యసిస్తుండగా మీ కుమారుడి చేతిలోని ఖడ్గం నా కుమారుడి చేతిని ఖండించింది. ఇది మా కుటుంబానికి తీవ్ర నష్టం, మనస్తాపం కలిగించింది. కంటికి కన్ను అన్న మన రాజ్య సంప్రదాయాన్ని అనుసరించి యువరాజు కుడిచేతిని ఖండించేలా తీర్పునివ్వండి,' అని కోరాడు.

అగ్నిహోత్రుడు చెప్పింది విన్న అక్కమయూఖుడు కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు. మహారాజు ఏం తీర్పు చెబుతాడోనని అందరూ ఆసక్తిగా ఎదురు చూశారు.

అప్పుడు అక్కమయూఖుడు, అగ్నిహోత్రుడితో, 'పండితోత్తమా! నా కుమారుడు ఏ చేత్తో ఖడ్గచాలనం చేస్తుండగా, నీ కుమారుడి చేయి తెగిపడిందో, ఆ చేత్తోనే నీ కుమారుడు యువరాజు

చేతిని తెగనరకాలి. ఇదే నా తీర్పు,' అని చెప్పాడు.

అగ్నిహోత్రుడు, 'మహారాజా! అదెలా సాధ్యం? యువరాజు కుడిచేత్తో ఖడ్గచాలనం చేస్తుండగా, నా కుమారుడి కుడి చేయి తెగిపడింది. మరిక నా కుమారుడు కుడిచేత్తో ఎలా యువరాజు చేయి ఖండించగలడు. అది అసాధ్యం కాదా?' అన్నాడు.

'అలా వీలుపడనప్పుడు శిక్ష కూడా వీలుపడదు. అదేధర్మం. నీ కుమారుడికి జరిగిన నష్టానికి ప్రతిగా అతనికి మంచి పదవినిస్తాను. క్షణమాలోచించండి,' అన్నాడు అక్కమయూఖుడు.

కొద్ది క్షణాలు ఆలోచించిన అగ్నిహోత్రుడు, మహారాజుకు నమస్కరించి 'మీ న్యాయమైన తీర్పును స్వాగతిస్తున్నాను. నన్ను మన్నించండి,' అని సభ వీడిపోయాడు.

అంతవరకు కథ చెప్పిన బేతాళుడు, 'రాజా! అక్కమయూఖుడి తీర్పులు బహు విచిత్రంగానూ, పరస్పర విరుద్ధంగానూ ఉన్నాయి. ఒక దొంగ తనకు తాను తప్పు చేశానని ఒప్పుకున్నా, అతడిని శిక్షించని రాజు... తన తప్పేమీ లేదని మొరపెట్టుకున్న బందిపోటును మాత్రం కన్నుకు కన్ను అంటూ కఠినంగా శిక్షించాడు.



అదే తన కుమారుడి విషయానికి వచ్చేసరికి కంటికి కన్ను అన్న సంప్రదాయాన్ని ప్రక్కనబెట్టి, కుడిచేత్తోనే యువరాజు చేతిని ఖండించాలని మెలికపెట్టి తన కుమారుడు శిక్షంచబడకుండా తప్పించాడు.

తీర్పులు బాగా చెప్పాడని పేరు గడించిన అక్కమయూఖుడు ఇతరులకు ఒకరకంగానూ, తనవారికి ఒకరకంగానూ తీర్పు చెప్పడం ఆశ్రిత పక్షపాతం.. స్వార్ధపరత్వం కాదా?

అయితే మహారాజు, యువరాజుకు శిక్ష పడకుండా స్వార్ధపూరితంగా తీర్పు చెప్పినా.. పండితుడు మీది న్యాయమైన తీర్పు అని ఎందుకు ప్రశంసించాడు?

మన్నించమని ఎందుకు కోరాడు? మహారాజు తనను శిక్షించగలడన్న భయంతోనా? లేక మరేదైనా కారణముందా? రాజా! సమాధానం తెలిసీ చెప్పకపోతే నీతల వెయ్యి ముక్కలవుతుంది' అని హెచ్చరించాడు.

అందుకు విక్రమార్కుడు, 'బేతాళా! కాలరుద్రుడనే దొంగ తను చేసింది తప్పని ఒప్పుకున్నాడు. అతని పశ్చాత్తాపం గమనించిన మహారాజు అందుకే అతడిని శిక్షించకుండా వదిలేశాడు.

ఇకపోతే గజదొంగ.. గూఢచారిని దోచుకునే ప్రయత్నం చేసి ఉండకపోవచ్చు. కానీ అతను ఎందరో ప్రయాణీకులను దోచుకున్న దోషి. విధి నిర్వహణలో ఉన్న గూఢచారి కన్ను పెరికి అతను పెను తప్పు చేశాడు. అందుకే మహారాజు కన్నుకు కన్ను అంటూ ఆ బందిపోటును కఠినంగా శిక్షించాడు.

ఇక యువరాజు విషయానికి వస్తే, అతను కావాలని సహాధ్యాయి చేతిని నరకలేదు. ఖడ్గవిద్యా శిక్షణ సమయంలో పొరపాటున అలా జరిగింది. అందుకే మహారాజు ఈ సందర్భంలో యువరాజును శిక్షించకుండా తీర్పు చెప్పాడు.

తీర్పు అనేది సర్వ కాలాలకు ఒకేలా ఉండదు. వ్యక్తులను బట్టి, సంఘటనలను బట్టి మారుతూ ఉంటుంది. అది ఆలస్యంగా గ్రహించబట్టే పండితుడు మహారాజుది న్యాయమైన తీర్పు అని ప్రశంసించాడు. తనను మన్నించమని కోరాడు. అంతే గాని మహారాజు శిక్షించగలడు అన్న భయంతో ఎంతమాత్రం కాదు,' అని చెప్పాడు.

విక్రమార్కుడి నుంచి సరైన సమాధానం రావడంతో బేతాళుడు మరలా చెట్టెక్కాడు. *(కల్పితం)*

*(ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు)*





# ఔదార్యం

రెండువేల సంవత్సరాల క్రితం చీనా దేశంలో సో-పో-తావూ అనే వృద్ధుడుం డేవాడు. ఆయన పేరుపడిన పండితుడు. కాని ఆయన పాండిత్యానికి మెచ్చి ఆద రించే దాతలు లేక దారిద్ర్యం అనుభవిం చేవాడు.

దూరాన చూ అనే రాజ్యానికి రాజుగా ఉంటున్నవాడు కూడా గొప్ప పండితుడే. ఆయన పండితులను ఆదరించి, దగ్గర ఉంచుకుని, వస్తువాహనాలిస్తాడని ప్రతీతి. ఆయన వద్దకు వెళ్ళి సన్మానాలు పొందవల సిందని తావూతో అనేకమంది మిత్రులు చెప్పారు. మిత్రుల మాటలు తోసివేయ లేక తావూ తన వద్ద గల కొద్ది పాటి ఉన్ని దుస్తులూ, ధనమూ తీసుకుని చూ రాజ్యా నికి కాలినడకను ప్రయాణమయాడు.

అనేక వందలమైళ్ళు వెళ్ళాలి. కొండల మీదుగా కష్టపడి ప్రయాణం చేయాలి. దారి మధ్యలో చలికాలం సంప్రాప్తమ యింది. ఎక్కడైనా కొద్ది రోజులు విశ్రాంతి తీసుకుందామని, ఒక ఊళ్ళో యాంగ్-చియాపూ-అయీ అనేవాడి ఇంటికి వెళ్ళాడు.

అయీ తావూకు ఉన్నంతలో చక్కగా అతిథి సత్కారం చేశాడు. తావూ పండితు డని తెలిసి అయీ ఆనందించాడు. అయీ మాత్రం సామాన్యుడు కాడు. ఆయన వద్ద ఉన్న గ్రంథాలు చూస్తే అయీ తన కంటే చాలారెట్లు పాండిత్యం గలవాడని తావూకు తెలిసిపోయింది. ఆయనతో పాండిత్య చర్చలు జరిపి తావూ ఈ విషయం మరింత గట్టిగా రుజువు చేసుకున్నాడు.

పి. తులసీరావు

'చూ దేశపు రాజు పండితులను గొప్పగా సత్కరిస్తాడట. ఆయనను చూడబోతు న్నాను. నీవు కూడా నా వెంట రారాదా?' అని అడిగాడు తావూ. ఆయీ ఒప్పుకుని చలిదుస్తులూ, డబ్బూ తీసుకుని బయ లుదేరాడు.

ఇద్దరూ కలిసి కొన్నాళ్లు ప్రయాణం సాగించిన అనంతరం మంచు తుఫాను వచ్చింది. లియాంగ్ పర్వతాల మధ్య వారి ద్దరూ ఈ మంచుతుపానులో చిక్కుకు న్నారు. ఇంకా నాలుగురోజులు నడిస్తే గాని వారు చూ దేశం చేరలేరు. వారు చలికి చచ్చి పోయే పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా ముసలివాడైన తావూ చాలా దీనస్థితిలో ఉన్నాడు. చివరికి ఆయన ఆయీతో ఈ విధంగా అన్నాడు.

'నాయనా, నా పనైపోయింది. నేనె లాగూ చూ దేశం చేరలేను. నా చలి బట్టలు కూడా నీవే వేసుకుంటివా ముందుకు సాగగలవు. చూ రాజును సందర్శించగ లవు. నా బట్టలిస్తాను, తీసుకో.'

దీనికి ఆయీ ఎంతమాత్రమూ ఒప్పు కోలేదు. 'వెళితే ఇద్దరమూ వెళదాము. లేకపోతే చలికి ఇద్దరమూ చద్దాము. మీ చలిబట్టలు తీసుకుని మీ మరణానికి కారణభూతుణ్ణి కావడానికి అసలే ఒప్పు కోను,' అన్నాడు ఆయీ.

'నాయనా, నీవు యువకుడివి. నేను కాటికి కాళ్లు చాచుకుని ఉన్నవాణ్ణి. చూ రాజు నాకు సన్మానం చేస్తే ఎంత, చెయ్యక పోతే ఎంత? అదీకాక, నీవు నా కన్న గొప్ప పండితుడివి!' అని చెప్పి చూశాడు తావూ.



ఆయీ వినిపించుకోలేదు. మంచు నుంచి తప్పించుకోవడానికి వారిద్దరూ ఒక గుహలో తలదాచుకున్నారు.

'ఎక్కడైనా నాలుగు పుల్లలు దొరికితే చలిమంట వేసుకోవచ్చునే!' అన్నాడు తావూ. ఆయీ పుల్లల కోసం బయటికి వెళ్లాడు. ఆయీ తిరిగి వచ్చేలోపుగా తావూ తన చలిబట్టలు విడిచి గుహలో పెట్టి వెలుపల ఉన్న మంచుగోతిలోకి దూకేశాడు.

ఆయీ తిరిగి వచ్చి చూసేసరికి గుహలో తావూ బట్టలు మాత్రమే ఉన్నాయి. గాభరాగా అతడు బయటికి వచ్చి వెతకగా మంచుగోతిలో పడివున్న తావూ శరీరం దొరికింది. తన కోసం ప్రాణాలను త్యాగం చేసిన తావూ ఔదార్యం తలుచుకుని ఆయీ చాలా దుఃఖించాడు. ఆయన శవాన్ని ఆ గుహలోనే భద్రం చేసి, తావూ విసర్జించిన బట్టలు ధరించి, ఆయీ క్షేమంగా చూదేశం చేరాడు.

చూ దేశపు రాజు ఆయీ పాండిత్యానికి సంతోషించి, ఆస్థాన కవిగా నియమించి, ధనమూ, వస్తువాహనాలూ ఇచ్చాడు.

ఇంత సన్మానమూ పొందుతూ అయీ కంట తడి పెట్టడం రాజు గమనించి, కారణమేమని అడిగాడు.

'ప్రభూ! నా పాండిత్యాన్ని మీరింతగా గౌరవిస్తున్నారు. తావూ ఔదార్యం ముందు నా పాండిత్యం ఏపాటి?' అన్నాడు ఆయీ.

తావూ చేసిన త్యాగం విని రాజు చాలా ఆశ్చర్యపోయాడు. ఆయన ఆయీతో సహా తావూ శవం భద్రం చేసిన గుహవద్దకు వెళ్లి, వైభవంగా తావూకు అంత్యక్రియలు చేయించి, అక్కడే సమాధి కట్టించాడు.

ఆయీ ప్రతి ఏడూ ఆ సమాధి వద్దకు వెళ్ళి, అశ్రుతర్పణాలు విడిచివస్తూ ఉండేవాడు. ఆయన అనంతరం చీనా దేశంలోని కవి పండితులకు తావూ సమాధి ఒక గొప్ప యాత్రాస్థలం అయింది.





# బామ్మగారు - బాబిగాడు

బాబి అయిదోతరగతి చదువుతున్నాడు. తల్లితండ్రులు లేరు. అన్ని పనులకు బామ్మ మీద ఆధారపడటం బాబిగాడికి అలవాటు. నిద్రలేచాక పక్కబట్టలు దులుపుకోలేడు. పళ్లను తోముకోలేడు. స్నానం చేసుకోలేడు. అన్నం స్వయంగా తినలేడు. బామ్మతోడు లేకుండా బడికి వెళ్లి రాలేడు.

తోటిపిల్లలతో ఆటలాడటానికి భయం. పాటలు పాడటానికి భయం. టీచర్లిచ్చిన ఇంటిపని స్వయంగా చేసుకోలేడు. వాడి మందబుద్ధి గురించి ఉపాధ్యాయులు అప్పుడప్పుడూ బామ్మతో ఫిర్యాదు చేసేవారు.

మనవడి మందబుద్ధి అలా ఉండిపోతుందేమోనని బామ్మ భయం. 'స్వయంగా నీ పనులు నువు చేసుకోడం నేర్చుకో,' అని చెప్పి చెప్పి విసిగిపోయింది. తనేమయినా అయిపోతే మనవడి గతేమిటని దిగులు పడుతుండేది. మనవడికి పక్షులను జంతువులను చూపించి వాటి పిల్లలు ఎలా ఇతరులపై ఆధారపడకుండా బతుకుతున్నాయో అర్థమయేలా వివరించేది.

బాబిగాడికి అవేవీ చెవిన పడేవి కావు. సతాయించి బామ్మ చెబితే, 'అబ్బ ఆ సొదంతా చెప్పకు. నీవు తోడు ఉన్నావుగా నాకేమిటి భయం?' అని చిరాకు పడుతుండేవాడు. బామ్మ తన ప్రయత్నం తాను మానలేదు. ఆ సంవత్సరం బాబిగాడు చదివే పాఠశాలలో ఐదవ తరగతి పిల్లలతో అరకులోయకు రెండు రోజుల విహారయాత్ర వేశారు. మినీ బస్సులో ప్రయాణం. అందరితో పాటు బాబిగాడు కూడా బయలుదేరాడు.

బస్సు ఘాట్‌రోడ్‌లో మలుపులు తిరిగినప్పుడల్లా పిల్లలు ఒకరి మీద ఒకరు పడి కేరింతలు పెట్టసాగారు. బస్సు కొండల మీద నుంచి పోతున్నప్పుడు లోయల దృశ్యాలు చూసి పిల్లలు సంబరపడుతూ టీచర్లు ఉన్నా

బెలగాం భీమేశ్వరరావు

రన్న ధ్యాస కూడా మరిచిపోయారు. కేకలు, చప్పట్లు. ఒకటే సందడి!

బాబిగాడికి ఇవేమీ పట్టలేదు. ఒక్కడే బిక్కుబిక్కుమని సీటుకు అతుక్కుపోయి నట్లు కూర్చున్నాడు. అది చూసి పిల్లలు, 'మీ బామ్మ గుర్తుకొచ్చిందా! ఆమెను తీసుకురా వలిసింది. అయ్యో పాపం. బామ్మ లేకుండా బాబిగాడు ఉండగలడా?' అంటూ గేలి చేయ సాగారు. బాబిగాడిలో ఉక్రోషం పెరిగింది. ముఖం ఎర్రబడింది.

బస్సు అరకు లోయ చేరింది. పిల్లలం దరూ బిలబిల బస్సు దిగారు. అందరకూ ఆకలి దంచుతోంది. టీచర్లు చూపించిన కేంటీన్ లోకి పిల్లలు చొరబడ్డారు. ఒకరిపై ఒకరు పరిహాసాలాడుకుంటూ పిల్లలు వేడి వేడి ఫలహారాలు తినసాగారు. ఒక్క బాబి గాడు మాత్రం ఫలహారం ముందు పెట్టు కుని కూర్చున్నాడు.

ఇడ్లీ తినబోతే చట్నీ జారి చొక్కాపై పడింది. నీరు తాగబోతే గ్లాసు పక్కనున్నవారిమీదకు మళ్ళింది. అందరూ నవ్వారు. 'పాపం బాబి గాడు. ఏ పనీ చేసుకోలేడు,' అని గేలి చేశారు. బాబిగాడిలో రోషం తొంగి చూసింది. ఎలా గోలా ఫలహారమయిందనిపించుకున్నాడు.

టీచర్లు పిల్లలనందరినీ క్యూలో నిలబె ట్టించారు. దగ్గరలో ఉన్న పద్మావతి ఉద్యాన వనంకి అందరు బయలుదేరారు. తోటలో రకరకాల మొక్కలు, పూలు క్రోటన్లు, జంతు వులు పక్షుల ఆకారాల్లో పొదలు ఉన్నాయి. పిల్లలు వాటిని చూశారు. గిరిజనుల చరిత్ర, సంస్కృతికి సంబంధించిన అనేక చిహ్నాలను వారు అక్కడ చూసి ఆనందించారు.



మధ్యాహ్నం రెండయింది. అందరూ భోజనానికి ఊర్లోకి వచ్చారు. బాబిగాడికి మళ్ళీ సమస్య వచ్చిపడింది. ఏది ఎలా కలు పుకోవాలో ముందు ఏది తినాలో బాబిగాడికి అర్థం కాలేదు.

బాబిగాడి అవస్థను చూసిన పిల్లలు, 'ఇప్పుడు మీ బామ్మ వచ్చి తినిపించదులే, అన్నీ కలుపుకుని ఈ రోజుకు తిను,' అని సలహాలివ్వడం ప్రారంభించారు. బాబిగాడు ఎలాగోలా భోజనం ముగించాడు. చేతులు శుభ్రం చేసుకున్నప్పుడు చొక్కా పూర్తిగా తడుపుకోవడం బాబిగాడికి చాలా అవమాన మనిపించింది. సాయంత్రం వరకు పిల్లలతో గడిపి అందరితో పాటు లాడ్జి చేరుకున్నాడు.

లాడ్జీలో బస. పిల్లలందరకూ ఆ అను భవం కొత్త! అసలే చలికాలం. అందులోనూ అరకులోయ చలి. పులిలా మీద పడి పలుక



రించింది. కాళ్లను డొక్కల్లో ముడుచుకుని తెచ్చుకున్న దుప్పట్లు కప్పుకుని అందరూ నిద్రపోయారు.

తెల్లవారింది. బాబిగాడికి మళ్లీ కష్టాలు ఆరంభమయ్యాయి. పళ్లు తోముకోవడానికి బ్రష్ పట్టుకోగానే బామ్మ గుర్తుకొచ్చింది. రోజూ బామ్మే దగ్గరుండి పళ్లు తోమేది. తోటి పిల్లలు చకచక బ్రష్ చేసుకుంటూ తనను గమనించడం చూశాడు. మొత్తంమీద బ్రష్ చేసుకోవడం పూర్తి చేశాడు. అందరిలాగే కొళాయి వద్ద స్నానం చేశాడు. ఉదయం ఫల హారం చేసేటప్పుడు చొక్కా మీద చట్నీ వేసు కోకుండానే జాగ్రత్తపడ్డాడు.

ఫలహారం తీసుకున్నప్పుడు తోటిపిల్లలు గమనించకపోవడం బాబిగాడికి మంచిదే అయింది. తడబాటు తగ్గింది. అంతలో పిక్నిక్ బస్సు హోటలు ముందుకొచ్చి ఆగింది. దగ్గరలో ఉన్న జలపాతం చూడటానికి అందరూ బస్సెక్కారు. కొంతసేపటికి బస్సు జలపాతం వద్దకు చేరుకుంది. ఏటవాలుగా ఉన్న ఒక చాపరాయి మీద నుండి గోస్థనీ నది నీరు ఒక లోయలోకి వరదలా జారిపడు తుంది. నీరు పడుతున్నప్పుడు వచ్చిన హోరు మన్న శబ్దం ఒక రకమైన భయాన్ని ఆనందాన్ని కలిగిస్తుంది. తుంపర్లతో కూడిన చల్లనిగాలి శరీరాలను తాకుతూ పిల్లలను ఆనంద పరవ శులను చేసింది. బాబిగాడు మరీ ఆనందం పొందాడు. అంతవరకు ఇల్లు కదలని అత డికి, ఆ విహారయాత్ర ప్రయాణం అతడి మనస్సును హత్తుకుంది. అక్కడ విశ్రాంతి పొందాక తిరుగు ప్రయాణమయ్యారు. తిరుగు ప్రయాణంలో కొండల మీద కోతుల గుంపులు చూస్తూ పిల్లలు భలే సరదా పొందారు. దారిలో బొర్రా గుహలు చూశారు. విశాలమైన ఆ గుహలో చిట్టిచీమల్లా పిల్లలు బారులు తీర్చి తిరిగారు. గుహల సౌంద ర్యాన్ని చూశాక అందరు మళ్లీ బస్సెక్కి పొద్దు కుంకకముందే ఊరు చేరారు. ఎవరిళ్లకు వారు చేరుకున్నారు.

మనవడు ఇల్లు చేరేసరికి అవ్వ ఆప్యా యంగా మనవడిని అక్కున చేర్చుకుని, 'ఎలా అయింది ప్రయాణం? ఎంతమంది వచ్చారు? విశేషాలు ఏమిటి? విహారయాత్ర నీకు నచ్చిందా! బాగా ఆనందించావా,' అంటూ ఏవేవో ప్రశ్నలు వేసింది బామ్మ. 'అవన్నీ వివరంగా చెబుతాను బామ్మా. ముందు నాకు భోజనం పెట్టు. ఆకలిగా ఉంది.' అన్నాడు బాబిగాడు. అవ్వ గబగబ భోజనం వడ్డించింది. అన్నం కూర కలిపి

బామ్మ తనకు తినిపించబోతుంటే బాబిగాడు ఆపాడు. తనే స్వయంగా తిన్నాడు. బామ్మ సాయం లేకుండానే ఎంగిలి చేయి కడుక్కున్నాడు. బామ్మ నివ్వెరపోయింది. యాత్ర విశేషాలు చెబుతూ బాబిగాడు పక్క బట్టలు సర్దుకున్నాడు. మనవడు స్వయంగా చేసుకుంటున్న పనులు చూసి బామ్మకు నోట మాట రాలేదు. అలిసిపోయి నిద్రపోయిన బాబిగాడి పక్కన బామ్మ చోటు చేసుకుని పడుకుంది.

తెల్లవారింది. బాబిగాడు స్వయంగా బ్రష్ చేసుకున్నాడు. బామ్మ స్నానం చేయించబోతుంటే 'వద్దు బామ్మా, నేనే స్నానం చేసుకుంటాను,' అని అన్నాడు. తరువాత భోజనం చేసి చకచక బడికి పోయాడు. బామ్మ నిశ్చేష్టురాలయింది. బడి వదిలే సమయానికి బాబిగాడిని తీసుకురావడానికి బామ్మ ఎదురుగా వెళ్తే బాబిగాడు బామ్మను చూసి 'పద పద, నేనొక్కడినే ఇంటికి వచ్చేయగలను. నేనింకా చిన్నపిల్లాడినేమీ కాను!' అంటూ బామ్మ కన్నా ముందుగానే ఇల్లు చేరుకున్నాడు. సాయంత్రం హోమ్‌వర్క్ కూడా తనే చేసుకున్నాడు. బామ్మసాయం తీసుకోలేదు. ఆ రాత్రి బామ్మ 'అన్నం తినిపిస్తాను. రా నాయనా,' అని పిలిస్తే 'నీవు తినిపించనక్కరలేదు అన్నం వడ్డించి పెట్టు చాలు,' అని తిరిగి సమాధానమిచ్చాడు.

బాబిలో ఇంత త్వరగా మార్పు వస్తుందని ఊహించలేదు బామ్మ.

వారం రోజుల తర్వాత ఒక ఉపాధ్యాయురాలు బామ్మకు కనిపించి, 'మీ బాబిగాడు బాగా మారాడు. అరకు విహారయాత్ర మీ మనవడిలో మార్పు బాగా తెచ్చింది. మీ మనవడి గురించి మీరిక దిగులు పడనక్కరలేదు. బయట ప్రపంచం, తోటి పిల్లలను గమనించి ఎంతో నేర్చుకున్నాడు. మనమనుకుంటున్నట్లు బాబిగాడు మందుడు కాడు బద్ధకస్తుడు అంతే. ఆ బద్ధకం విహారయాత్రలో వదిలింది!' అన్నారు.

బామ్మ దిగులు పటాపంచలయింది. స్వయంగా పనులు చేసుకుపోతున్న మనవడిని చూసి ఆమె మురిసిపోయింది.





# పంచతంత్ర కథలు

దుష్టబుద్ధికి అతని తండ్రి కొక్కిరాయి కథ చెప్పి 'వివేకం గలవాడు ఏదన్నా పథకం ఆలోచించినప్పుడు అందులో ఉండే దోషాలు గ్రహింపు చేసుకోవాలి. నీ పథకంలో నాకు అనేక లొసుగులు కనిపిస్తున్నాయి,' అన్నాడు.

దానికి దుష్టబుద్ధి తన తండ్రితో, 'లేదు లేదు. ఇది మంచి పథకమే. ఏ పథకంలోనైనా ఏదో లోపం ఉండకపోదు. నువు నేను చెప్పినట్లు చెయ్యకపోయావో వృక్షదేవత సాక్ష్యం పలకదు. అబద్ధమాడానని న్యాయాధిపతులు నా తల కాస్తా తీసేస్తారు. అందుచేత, నాన్నా, నువు నా ఆలోచనకు సమ్మతించాలి. దానితో మనిద్దరమూ క్షేమంగా బయటపడి, హాయిగా జీవిస్తాం,' అన్నాడు. ఎలాగైతేనేం, దుష్టబుద్ధి తన తండ్రిని, చెట్టుతొర్రలో ఎవరికీ కనబడటానికి వీలు లేకుండా ఆయనను దాచాడు.

మర్నాడు ఉదయం దుష్టబుద్ధి స్నానం చేసి అడవిలో చెట్టు దగ్గరకు వెళ్లాడు. అక్కడికి న్యాయాధికారులూ, ధర్మబుద్ధీ చేరారు. అందరూ వింటూండగా దుష్టబుద్ధి గొంతెత్తి, 'మనుష్యులు చేసేదంతా సూర్య చంద్రులకూ, నక్షత్రాలకూ, పంచభూతాలకూ, అంతరాత్మకూ, మృత్యువుకూ, రాత్రి పగళ్లకూ, ఉభయసంధ్యలకూ, వృక్షదేవతలకూ తెలుసును. కనుక, ఓ వృక్ష దేవతా మా ఇద్దరిలో దొంగ ఎవరో చెప్పు!' అన్నాడు.

అతని తండ్రి చెట్టు తొర్రలో నుంచి, 'బంగారం అపహరించిన వాడు ధర్మబుద్ధి,' అని పలికాడు.

మిత్రభేదం–**28**

ఈ మాట విని ధర్మబుద్ధి, 'వృక్షదేవత సాక్ష్యం పలకటమేమిటీ? ఎక్కడా లేని సంగతే! పైగా ఆ పలికేది నిజంగా దేవత అయి ఉండదు. దేవతలు నిజం తప్ప పలకరు. ఇందులో ఏదో మోసం ఉన్నది. బుద్ధిమంతుడికి మోసం తెలిసి తీరుతుంది. చెట్టుతొర్రలో దుష్టబుద్ధి ఎవరినో దాచి ఉంటాడు. ఈ దొంగదేవతకు సరి అయిన విధంగా బుద్ధి చెబుతాను. నేను చాలా జాగ్రత్తగా మసలాలి. ఎందుకంటే న్యాయాధికారులు మూఢులు. నేను దోషనని వారికి నమ్మకం కుదిరింది,' అనుకున్నాడు.

అతను న్యాయాధికారులతో, 'అయ్యలారా! ఈ వృక్ష దేవత నిజం తెలుసుకోవటమూ, దానిని చెప్పటమూ నిజంగా అద్భుతమైన సంగతి. నా పేరు ధర్మబుద్ధే ననుకోండి. నాకు నిజంగా డబ్బు అవసరం లేకపోయినా, క్షణికమైన దౌర్బల్యం కారణంగా నేనిక్కడికి ఒంటరిగా వచ్చి, బంగారం తీసుకున్నాను. నేను డబ్బు తీసుకోబోతూ ఉండగా ఒక భయంకరమైన పాము ప్రత్యక్షమయింది. అప్పుడు నాకు ఏమనిపించిందంటే, శకునం బాగా లేదు: పోయిన డబ్బు తిరిగి రాదు గద! పాము వెళ్లిపోయాక మరో సారి వచ్చి డబ్బు తీసుకుపోదామనుకున్నాను. అలా అనుకుని బంగారాన్ని చెట్టు తొర్రలో దాచాను. దానికి రక్షగా పాము కూడా తొర్రలో జొరబడింది. నేను మీకు బంగారం అప్పగించుతాను. ఎలానైనా ఆ పామును చంపి బంగారం పైకి తీస్తాను. కొంచెం పక్కకు తొలిగారంటే



పాముకు ఊదరపెడతాను,' అన్నాడు. న్యాయాధికారులు అందుకు సమ్మతించారు. ధర్మబుద్ధి చెట్టుతొర్రలో ఎండుపుల్లలూ, ఎండు ఆకులూ కుక్కి, వాటికి నిప్పు పెట్టాడు.

దుష్టబుద్ధి పాలిపోయిన ముఖంతో తల వంచుకుని నిలబడి, చెట్టు తొర్రలో ఉన్న తన తండ్రికి ఏం మూడుతుందో, నిజం బయటపడితే తన గతి ఏమవుతుందో అని బెంగపడసాగాడు.

త్వరలోనే మంటలూ, పొగా తొర్రలోకి ఎక్కాయి. కొద్ది సేపటికల్లా దుష్టబుద్ధి తండ్రి, ఒళ్లు సగం కాలి, కళ్లు రెండూ పోయి ఆర్తనాదాలు చేస్తూ బయటికి దొర్లాడు.

న్యాయాధికారులు ఆయనను 'ఏమిటిది?' అని అడిగారు. 'నా కొడుకు దుష్టబుద్ధి చేసిన దుస్తంత్రం,' అంటూ ఆయన జరిగినదంతా చెప్పి ప్రాణాలు వదిలాడు.

న్యాయాధికారులు దుష్టబుద్ధిని ఆ చెట్టు కొమ్మకే ఉరితీసి, ధర్మబుద్ధిని ప్రశంసించారు.

కరటకం దమనకానికి దుష్టబుద్ధి కథ చెప్పి, 'మూర్ఖుడా, అనాలోచనగా చేసిన ఈ పనివల్ల నీకు నువే హాని తెచ్చుకోవటమే కాక, నాతో సహా మన కుటుంబానికంతకూ ప్రమాదం తెచ్చావు. మూర్ఖుల లక్షణమే అది.

నదులు ఉప్పుసముద్రం పాలవుతాయి. పోట్లాడుకునే స్త్రీలు కుటుంబాన్ని చీల్చుతారు. అలాగే నీ స్వభావాన్ని బట్టి నువు పింగళకానికీ, సంజీవకానికీ మధ్య స్పర్థ తెచ్చిపెట్టావు. నువు ఎంత మూర్ఖుడివంటే ఎలుకలు ఇనుముతిన్న కథను కూడా నమ్మవచ్చు,' అన్నది.

'ఏమిటా కథ!'అని దమనకం అడిగింది. కరటకం ఇలా చెప్పింది:

(ఇంకా వుంది)





# వడ్డించే గరిటె!

గోవిందం ఇంటి పొరుగున ఉంటున్న రామేశం, ఒకరోజు గోవిందం దగ్గరకొచ్చి, 'పట్నంలో ఒకతను నాకు కొంత పైకం బాకీ ఉన్నాడు. వసూలు చేసుకుని వద్దామను కుంటున్నాను, కాస్త తోడు వస్తావా,' అన్నాడు.

అందుకు గోవిందం, 'దానికేం భాగ్యం, నాక్కూడా పట్నంలో కొద్దిగా పని ఉంది. అయితే, ఈరోజు తిథి ఎంతమాత్రం బాగా లేదు. రేపు దివ్యంగా ఉన్నది. వేకువనే బయలుదేరుదాం!' అన్నాడు.

గోవిందానికి చాదస్తం ఎక్కువ. వారం, వర్జ్యం చూడందే ఏ పనీ చెయ్యడు. ఈ విషయం అంతో ఇంతో తెలిసి ఉన్న రామేశం సరే అన్నాడు.

మరుసటి రోజు ఉదయం ఇద్దరూ బయలుదేరి అలా వీధిలో కాలుపెట్టారో లేదో, తమకు రెండిళ్ల అవతల ఉన్న గుర్నాథం అటు వైపు వస్తూ కనిపించాడు. గోవిందం, రామేశంతో 'ఇంట్లోకి వెళ్లి, ఓ ఘడియ కూర్చుని మళ్లీ బయలుదే రుదాం,' అన్నాడు.

గుర్నాథం తమ ఇళ్లు దాటి వెళ్లాడని నిర్ధారించుకున్నాక ఇద్దరూ మళ్లీ వీధిన పడ్డారు.

'గుర్నాథం శకునం మంచిది కాదా?' అంటూ రామేశం అడిగాడు.

'శకునం సంగతి అటుంచి, అతని నోరు మంచిది కాదు, ఎక్కడికి? ఎందుకు? అంటూ ఆరాలు మొదలెడతాడు! ఊర్లో విషయాలన్నీ తెలుసుకోనిదే అతనికి తోచదు,' అన్నాడు గోవిందం.

అందుకు రామేశం, 'అతడు ప్రతి రోజూ వేకువనే పొరుగూరి గ్రంథాలయం

గవ్వల నిర్మలాదేవి



వెళ్లి, దిన, వార పత్రికలు చదివి వస్తూ ఉంటాడట, నిజమేనా?' అన్నాడు.

'సర్లే, ఇప్పుడు అతని సొద ఎందుకు? త్వరగా పద!' అన్నాడు గోవిందం.

ఇద్దరూ పట్నం చేరుకుని, రామేశానికి డబ్బు బాకీ ఉన్న వ్యక్తి ఇంటికి వెళ్లాడు. అతడు అప్పుడే పొరుగూరు బయలుదేరి వెళ్లినట్లు, రెండు రోజుల వరకూ తిరిగి రాడని తెలిసింది. దాంతో రామేశం నిరాశ చెందాడు. ప్రస్తుతం అతనికి డబ్బు అవసరం చాలా ఉన్నది. గోవిందంతో పెట్టుకోకుండా తను ముందురోజు వచ్చి ఉంటే డబ్బు చేతికంది ఉండేదనుకున్నాడు.

తర్వాత వాళ్లు గోవిందం పనికోసం బజారు వీధికి వచ్చారు. గోవిందం తన పిల్లల కోసం పాఠ్య పుస్తకాలు, దుస్తులు కొనాలనుకున్నాడు. కానీ ఆ రోజు దుకాణాలన్నీ మూయబడి ఉన్నాయి. విచారించగా, ఆరోజు దుకాణదారులు సమ్మె చేస్తున్నారని తెలిసింది. ఇద్దరికీ ఆకలి దంచేస్తోంది. గోవిందం, ఎప్పుడు పట్నం వచ్చినా భోజనం చేసే శాఖాహార భోజనశాల కూడ మూసివేసి కనిపించింది. తక్షణం కడుపులో ఏదో ఒకటి పడితే తప్ప కాలు కదపలేమని ఇద్దరికీ అనిపించింది. పక్క వీధిలో ఓ పూటకూళ్ల ఇల్లు ఉన్నదని అక్కడున్న వాళ్లు చెప్పారు.

ఇద్దరూ పూటకూళ్ల ఇంటికి వెళ్లారు. కాళ్లూ చేతులూ కడుక్కుని భోజనాల బల్లదగ్గర కూర్చున్నారు. వడ్డన చేసే అతను వీరి ముందు పళ్లేలు ఉంచుతూ, 'శాఖాహారమా? మాంసాహారమా? ఏది వడ్డించమంటారు?' అన్నాడు. గోవిందం చప్పున లేచి నిలబెడుతూ, 'రామేశం, నాతోరా?' అని రామేశాన్ని ఆదేశిస్తున్నట్లు పిలిచాడు.

అప్పటికే గోవిందం చాదస్తంతో విసిగిపోయిన రామేశం కూర్చున్న చోటు నుండి కదలకుండా, 'ఇక్కడ భోంచేయడానికి నాకెలాంటి అభ్యంతరం లేదు!' అని తనకు శాఖాహార భోజనం వడ్డించమని వడ్డన చేసే కుర్రాడితో చెప్పాడు.

గోవిందం పూటకూళ్లయజమాని వద్దకు వెళ్లి, తనకు విడిగా బల్ల ఏర్పాటు చేసి, విస్తరిలో వడ్డన చేయమని కోరాడు. యజమాని అదనంగా ఇరవై రూపాయలు పుచ్చుకుని ఆ ఏర్పాట్లు చేయించాడు.

భోజనాలయ్యాక ఇద్దరూ ఊరిదారి పట్టారు. దారిలో గోవిందం, రామేశంతో 'నీవుకూడా నాతోబాటు కూర్చుని భోంచే యాల్సింది,' అన్నాడు.

అందుకు రామేశం, 'అలా కూర్చున్నా బాగుండేది! నేనా విషయం గమనించక పోదును!' అన్నాడు రామేశం.

'ఏ విషయం,' అన్నాడు గోవిందం! రామేశం కాస్త తటపటాయిస్తూ, 'అక్కడ వడ్డన చేసే కుర్రాడు ఒకటి రెండు సార్లు మాంసాహారానికి ఉపయోగించిన గరిటెనే మనకు శాఖాహారం వడ్డించడానికి ఉప యోగించాడు మరి,' అన్నాడు.

గోవిందం నోరెళ్లబెట్టాడు. అప్పుడు రామేశం, 'మనకిలా జరగవలసిందేలే! మంచిరోజూ అదీ చూసుకోకుండా నిన్న బయలుదేరి ఉంటే మన ఇద్దరి పనులూ తెమిలి ఉండేవి. పైగా ఈ తిప్పలు ఉండేవి కావు. పోనీ గుర్నాథం ఎదురుపడ్డాడని వెనక్కు వెళ్లకుండా వచ్చి ఉండినా సరిపో యేది. అప్పుడే దినపత్రిక చదివి వస్తున్న అతడు దుకాణాల సమ్మె గురించి మనకు తెలిపి ఉండేవాడు. మనం ప్రయాణం మానుకుని ఉండేవాళ్లం!

మనం అనవసరంగా గుర్నాథాన్ని కించ పరిచామేమో అనిపిస్తున్నది! అయినా ఈ ఆచారాలూ, నమ్మకాలూ అనేవి ఇతరు లను బాధపెట్టనంతవరకూ, అలాగే మన శరీరానికి ఇబ్బంది కలిగించనంత వరకూ మాత్రమే పాటించవచ్చని నాకనిపిస్తోంది,' అని సూటిగా అన్నాడు.

రామేశం ఈ మాటలు తనను ఉద్దేశించి అంటున్నవని గోవిందానికి అర్థమయింది.

'ఇకనుండి నేను నా తరహా మార్చు కోవడానికి ప్రయత్నిస్తాను,' అన్నాడు అతడు మెల్లగా రామేశంతో.

వడ్డించే విషయంలో తను కల్పించి అప్పటికప్పుడే చెప్పిన అబద్ధం గోవిందం మీద బాగా పనిచేసిందని రామేశం సంతో షించాడు.





# బ్రహ్మ ప్రళయం

బ్రహ్మదేవుడు భూమిపై మానవులను సృష్టించి, 'నాయనలారా, తిరిగి నేను ప్రళయం కలిగించేదాకా మీరు ఈ భూమిపై జీవించండి!' అని వరం ఇచ్చాడు.

'దేవా, తిరిగి ప్రళయం, ఎప్పుడు వస్తుందో మాకు తెలిసినట్టయితే మేము భూమిపై చేయదగిన కార్యాలను నిర్ణయించుకుంటాము!' అన్నారు మానవులు.

'ప్రళయం ఎంతకాలానికి జరిగేదీ మీకు తెలిసేందుకు నేనొక ఏర్పాటు చేస్తాను,' అంటూ బ్రహ్మదేవుడు ఒకచోట మూడు కర్రలు పాతాడు. మొదటి కర్రకు 64 వలయాలు అమర్చాడు. అట్టడుగున ఉన్న వలయం అన్నిటి కన్నా పెద్దది, దానిపైది కొంచెం చిన్నది, దానిపైది ఇంకా కొంచెం చిన్నది, అన్ని వలయాలకూ పైన ఉన్నది అన్నిటికన్న చిన్నది.

తరవాత బ్రహ్మదేవుడు ముగ్గురినీ పిలిచి, 'మీరు బ్రహ్మప్రళయం దాకా జీవించే వరం ఇస్తున్నాను. మీ పని ఏమిటంటే ఈ వలయాలన్నిటినీ ఇదే క్రమంలో మూడవ కర్రకు మార్చాలి. పెద్ద వలయం మీద చిన్న వలయం ఉంచవచ్చునే గాని చిన్నదాని మీద పెద్ద వలయం ఉంచరాదు. రెండవ కర్రను తాత్కాలికంగా వలయాలుంచటానికి మాత్రమే ఉపయోగించాలి. మీరు ముగ్గురూ వంతులు వేసుకుని ఈ పని సాగించండి. ఈ అరవై నాలుగు వలయాలూ మూడవ కర్రకు ఇదే క్రమంలో అమర్చిన క్షణాన ప్రళయం వస్తుంది!' అన్నాడు.

మరుక్షణం బ్రహ్మ అంతర్ధానమయిపోయాడు. తరువాత బ్రహ్మ నియమించిన వారిలో మొదటి వాడు బ్రహ్మ చెప్పినట్లు చేయసాగాడు. అతను అన్నిటికన్న చిన్న

డి. కురంగేశ్వరరావు

దైన మొదటి వలయాన్ని తీసి రెండవ కర్రకు తగిలించి, దానికంటే పెద్దదైన రెండో వల యాన్ని మూడో కర్రకు తగిలించి, దానిపై మొదటి వలయాన్ని పెట్టాడు. తరువాత మూడవదాన్ని రెండో కర్రకు పెట్టి పని సాగించాడు.

ఇది చూస్తున్న వారిలో ఒకడు, 'ఈ పని ఎంతో సేపు పట్టదు. మన మానవులకు భూమిపై గల కాలం బహుకొద్ది. ఈ కొద్ది కాలంలో ఏం చెయ్యగలం?' అన్నాడు.

మూడోవాడు మాట్లాడలేదు. ఒక విఘ డియ ముగిసే లోపల అయిదారు వల యాలు మూడవ కర్రను చేరాయి. అయినా అతను కంగారుపడలేదు. తాము ముగ్గురూ కలిసి అవిరామంగా పనిచేస్తే వలయాలను రోజుకు ఒక లక్షసార్లు ఇటూ అటూ కది లించగలమని అంచనా వేశాడు. అలాటి కదలికలు ఎన్ని పూర్తి అయితే బ్రహ్మ ఒప్ప జెప్పిన పని ముగుస్తుందో అంచనా కట్టడా నికి అతనికి చాలా కాలం పట్టింది.

అప్పటికి ప్రపంచంలో గణితశాస్త్రం లేదు. అందుచేత ఆ వ్యక్తి గణిత శాస్త్రాన్ని స్వయంగా సృష్టించవలసి వచ్చింది. ఆ శాస్త్రం సహాయంతో అతను ఈ వలయా లను 18,446,744,073,709,554, 615 సార్లు మార్చితే గాని అవి మొదటి కర్రనుంచి మూడవ కర్రకు మారవని నిర్ధా రణ చేశాడు.

రోజుకు లక్ష మార్పుల చొప్పున వీటన్ని టినీ పూర్తి చేయడానికి దాదాపు యాభైవేల కోట్ల సంవత్సరాలు పడుతుందని గ్రహిం చాడు. అతను తన అనుచరులతో, 'సోదరు లారా! ఇక ఈ పని మనం మానవచ్చు. ఎందుచేతనంటే ఇంకా యాభైవేల కోట్ల ఏళ్ల దాకా బ్రహ్మప్రళయం రాదు. ఈ లోపుగా మానవులం ఎన్ని అద్భుత కార్యాలు సాధిం చినా సాధించవచ్చు,' అన్నాడు.

అతను గుణించిన లెక్కలను మిగిలిన ఇద్దరూ కూడా అర్థం చేసుకుని గణిత శాస్త్రంలో ప్రవీణులయ్యారు.





# నాలుగో దొంగ

ఒక దేశంలో ముగ్గురు గజదొంగలుండే వారు. వారు రోజుకొక దొంగతనం చేసినా వారిని పట్టడం ఎవరికీ సాధ్యం కాలేదు. వాళ్ల పేరు చెబితే ధనికులకు సింహ స్వప్నంగా ఉండేది. వాళ్లను ఏవిధంగా నైనా పట్టాలనే ఉద్దేశంతో ఆ దేశపు రాజు ప్రతి రాత్రీ తానుకూడా ఒక దొంగలాగా వేషం వేసుకుని తిరగసాగాడు.

ఈవిధంగా కొన్ని రాత్రులు తిరగగా తిరగగా ఒక చీకటి రాత్రి రాజుకు దొంగలుండే స్థలం చిక్కింది. రాజు అక్కడికి చేరుకునేసరికి ఆ దొంగలు ఆ రాత్రి తాము చేయదలిచిన దొంగతనం గురించి ఆలోచిస్తున్నారు. కొత్త దొంగను చూడగానే గజదొంగలకు, కొంత అనుమానం కలిగి, ‘ఎవరు నీవు? ఇక్కడికి ఏం పని మీద వచ్చావు?’ అని అడిగారు.

‘నేనూ దొంగనే. ఈ ప్రాంతాల్లో మీరు చాలా గొప్ప దొంగలని విని మీకు నా శక్తి చూపించవచ్చాను,’ అన్నాడు రాజు.

దొంగలు నవ్వి, ‘మా శక్తులను గురించి నీకేమైనా తెలుసా?’ అని అడిగారు.

‘తెలియదు. చెప్పండి, వింటాను!’ అన్నాడు రాజు.

‘నేను ఎంతటి లావు తాళాన్నయినా పూచిక పుడకతో తీయగలను,’ అన్నాడు మొదటి దొంగ.

‘నేను భూమికి చెవిపెట్టి ఆలకించానంటే డబ్బు ఎక్కడ ఉన్నదీ పసికట్టగలను,’ అన్నాడు రెండో దొంగ.

ఎస్. కోదండరామయ్య

'ఒకసారి చూసిన మనిషిని నేను ఏ మారువేషంలో ఉన్నా పోల్చగలను,' అన్నాడు మూడో దొంగ.

'నీ శక్తి ఏమిటి?' అని ముగ్గురు దొంగలూ రాజును అడిగారు.

ఏం చెప్పాలో రాజుకు తోచలేదు. అందుచేత ఆయన ఈ విధంగా అన్నాడు.

'నేను బొటనవేలు కిందికి దించా నంటే ఎవరినైనా యమలోకానికి పంపగ లను. చూపుడు వేలు పైకెత్తానంటే చావ టానికి సిద్ధంగా ఉన్నవాళ్లు బతికి బయ టపడతారు,' ఈ మాటలకు ముగ్గురు దొంగలూ సంతోషించారు. తమంత శక్తి సామర్థ్యాలు కలవాడు, తెలివైనవాడూ తోడు వచ్చాడు, అనుకున్నారు.

'ఈ రాత్రి ఎక్కడికి దొంగతనానికి పోదాం?' అని అడిగాడు రాజు.

'నీయిష్టం! నువు కోరుకున్న చోటికి పోదాం. మా శక్తిసామర్థ్యాలను నువే చూతువు గాని!' అన్నారు దొంగలు.

'అయితే, రాజుగారి ఖజానా కొల్ల గొడదాం!' అన్నాడు రాజు.

నలుగురూ కలిసి రాజప్రసాదానికి బయలు దేరారు. పహారావాళ్ల కంటబడ కుండా లోపలికి చేరారు. రెండో దొంగ నేలకు చెవిపెట్టి ఆలకించి:

'ఖజానా ఈ వైపుగా ఉంది. జాగ్రత్తగా నడవండి!' అని చెప్పాడు. నలుగురూ అటుకేసి వెళ్లారు. ఖజానాకు పెద్దతాళం వేసి ఉంది. కాని దాన్ని మొదటి దొంగ



క్షణంలో ఊడదీశాడు. దొంగలు లోపల ప్రవేశించారు. ఈ సమయంలో రాజు వాళ్లకు తెలియకుండా వెళ్లిపోయి తన భటులను పంపాడు. గజదొంగలు ముగ్గురూ సొత్తుతో సహా పట్టుబడ్డారు.

మర్నాడు వారిని విచారణకు దర్బారుకు తీసుకొచ్చారు. సింహాసనం మీద కూర్చున్న రాజును చూస్తూనే మూడో దొంగ తన తోటి వాళ్లతో, 'ఈయనే నిన్న మనతో పాటు దొంగతనానికి వచ్చిన కొత్త మనిషి!' అని చెప్పాడు.

విచారణ అయిపోగానే రాజు తన కుడిచేతి బొటన వేలు కిందికి తిప్పాడు. గజదొంగలకు మరణశిక్ష విధించబడింది.

మరునాటి ఉదయం వారి ముగ్గురిని ఉరికంబం దగ్గరకు తీసుకుపోయారు. అధికారి ఒకడు వచ్చి 'మీ ఆఖరు కోరిక ఏమిటి?' అని దొంగలను అడిగాడు. 'రాజుగారిని ఒక్క ప్రశ్న అడగాలి. అదే మా ఆఖరు కోరిక!' అన్నారు దొంగలు.

రాజుగారు వచ్చారు. 'మీరు నన్నడగగోరే ప్రశ్న ఏమిటి?' అన్నాడాయన.

'మరేం లేదు మహాప్రభూ! మా శక్తులను మీకు ప్రదర్శించాం. మీ శక్తులను గురించి మాకు రెండు విషయాలను చెప్పారు. రెండోది కూడా చూసి సంతోషించాలని మా కోరిక,' అన్నాడు మూడో దొంగ.

రాజు చిరునవ్వు నవ్వి తన చూపుడు వేలు పైకెత్తాడు. వెంటనే రాజభటులు వచ్చి గజదొంగల కట్టు విప్పేసి, ఉరికంబం నుంచి దించేశారు. తరువాత ఆ గజదొంగలు దొంగతనాలు మాని రాజుదగ్గరే కొలువుంటూ, రాజుగారి పట్ల ఎంతో భక్తిగా కాలం గడిపారు.





# మేకు విలువ

పూర్వం ఒక గ్రామంలో ఒక పేదయువకుడు ఉండేవాడు. అతని పేరు గోవిందుడు. అతనికి పెళ్ళి అయింది. ఇద్దరు పిల్లలు కూడా కలిగారు. కాని భూవసతి కొంచెమైనా లేకపోవడం చేత గోవిందుడు వారిని తన రెక్కల కష్టంమీద పోషించవలసి వచ్చింది. ఇందుకు గాను అతను రహదారిని బస్తీకి నడిచివెళ్లి, ఏదైనా కూలీనాలీ చేసి డబ్బులు సంపాదించి, ఆ డబ్బుతో ఇంటికి కావలసిన వెచ్చాలు తెచ్చుకుంటూ ఉండేవాడు.

వస్తుతః గోవిందుడు పొదుపు ఎరిగినవాడు. అతని చిన్నతనంలో అతని తండ్రి 'నాయనా! ప్రతి చిన్న వస్తువుతోనూ ఎప్పుడో ఒకప్పుడు అవసరమైన పని ఉంటుంది,' అని చెప్పేవాడు. గోవిందుడు తన తండ్రి చెప్పిన పాఠాన్ని మరిచిపోలేదు.

ఒకనాడు అతను రహదారిన బస్తీకి నడిచిపోతుండగా అటుగా మంత్రికొడుకు గుర్రం ఎక్కి శరవేగంగా వచ్చాడు. గోవిందుడు చూస్తుండగానే గుర్రం కాలి నాడా తాలూకు మేకొకటి జారి, తళుక్కున మెరిసి దారిలో పడిపోయింది.

'బాబూ, నాడా మేకు పడిపోయింది!' అని గోవిందుడు, ఎలుగెత్తి అరిచాడు.

మంత్రి కొడుకు వెనక్కు తిరిగి చూసి, నిర్లక్ష్యంగా చెయ్యి ఊపి ముందుకెళ్లాడు. ఒక నాడా మేకు కోసం వెనక్కు వెళ్లడం అతనికి పరువు లోపమనిపించింది. అదీ గాక అతను అరణ్యంలోనుంచి వెళ్ళే అడ్డ

పి. గోవిందరావు



దారిన నగరానికి వెళుతున్నాడు. అందుచేత ఆ మేకు లేనందువల్ల పెద్ద ఇబ్బంది ఏమీ ఉండదనుకున్నాడు.

కాని ఈ విషయంలో మంత్రికొడుకు చాలా పొరపడ్డాడు. అతను అరణ్యంలో అట్టే దూరం పోకమునుపే గుర్రం నాడా వదులై ఊడివచ్చింది. గోవిందుడి దగ్గిర మేకు తీసుకుని ఉండినట్లయితే మంత్రి కొడుకు ఏదో విధంగా నాడాను మళ్లీ బిగించి ఉండేవాడే. కాని నాడా లేక గుర్రం కుంటుతూ ఉండటం చేత అతను గుర్రం నుంచి దిగి నడవవలిసి వచ్చింది. దొంగలు అతని మీద పడి, నిలువు దోపిడీ చేసి, అతడిని ఒక చెట్టుకు కట్టి పారిపోయారు.

ఈలోగా గోవిందుడు నాడా మేకు తీసుకుని తన వద్ద ఉంచుకుని ముందుకు సాగాడు. అతను కొంత దూరం వెళ్లేసరికల్లా ఒక బండి దారిలో ఒరగబడి ఉండటం కనిపించింది. శాయిమేకు పోవటం చేత ఒక బండి చక్రం ఊడి వచ్చేసింది. బండి పక్కనే ఒక ధనికుడు నిలబడి ఉన్నాడు.

ఆయన గోవిందుడిని చూడగానే, 'అబ్బీ నీదగ్గిర ఏదైనా మేకున్నదా? నేను త్వరగా నగరం చేరాలి. దారి మధ్యలో ఎక్కడో శాయి మేకు పడిపోయింది. ఈ దిక్కుమాలిన ప్రదేశంలో కాస్త ఇనపముక్క కూడా ఉన్నట్లు కనబడదు!' అన్నాడు.

గోవిందుడు తన వద్ద ఉన్న నాడా మేకు తీసి దాన్ని చక్రం ఇరుసులోకి రాతితో దిగవేశాడు. చక్రం గట్టిగానే పట్టింది. ధనికుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

'నువుకూడా నగరానికి పోతున్నావేమో బండిలో రా!' అంటూ ధనికుడు గోవిందుణ్ణి తనతో నగరానికి తీసుకుపోయి అతని చేతిలో ఒక బంగారు కాసు పెట్టాడు.

ఆ కాసు చూడగానే గోవిందుడి కళ్లు పెద్దవయ్యాయి. అది తన కుటుంబానికి రెండు మాసాలు సరిపోతుంది. తన తండ్రి ఏనాడో అన్నమాట ఇప్పుడు అక్షరాలా నిజమైంది. ఒక చిన్న నాడా మేకు బంగారు కాసు తెచ్చి పెట్టింది! గోవిందుడు నగ

రంలో తన కుటుంబానికి నెలరోజులు సరిపడే సరుకులు కొని ఒక గోతంలో వేసుకుని, దగ్గిరదారి గదా అని అరణ్యం గుండా ఇంటికి రాసాగాడు. అతను కొంత దూరం వచ్చేసరికల్లా దారికి ఒక పక్కనున్న చెట్ల వెనుకనుంచి ఏవో ఆర్తనాదాలు వినిపించాయి.

గోవిందుడు తన గోతాన్ని గుర్తుగా ఒక చోట పొదల మధ్య దాచి చెట్లలో ప్రవేశించాడు. అతను చాలాసేపు నడిచాక ఒక చోట ఆరుగురు పిల్లలూ ఒక స్త్రీ కనిపించారు. అందరూ దీనస్థితిలో ఉన్నారు.

ఆ స్త్రీ ఒక కోటీశ్వరుడి భార్య. పిల్లలందరూ ఆమె సంతతి.

'మొన్న సాయంకాలం మేమంతా కలిసి అరణ్యంలో విహారం కోసం వచ్చాం. మా పిల్లలు పూలకోసం అడవిలో జొరబడ్డారు. వాళ్లెక్కడ తప్పిపోతారో అని నేను కూడా వాళ్ల వెంటే వెళ్లాను. ఇంతలో పొద్దుగూకింది. మాకు దారి తెలియలేదు. ఆ రాత్రంతా తిండి లేకుండా దారి వెతుకుతూ తిరిగాం. నిన్నల్లా మాకు దారి దొరకలేదు. అన్నమూ నీళ్లూ లేకపోవడం చేత, మాకు తిరిగే శక్తి కూడా లేకపోయింది. ఇక్కడినుంచే కేకలు పెట్టాం. మా మొర ఆలకించిన వాళ్లు లేరు. ఇవాళ నువు దేవుడల్లే వచ్చావు!' అన్నది కోటీశ్వరుడి భార్య.



'మీకు వచ్చిన భయమేమీ లేదు. నేను మీకు దారి చూపిస్తాను. నా వెంట రండి,' అన్నాడు గోవిందుడు.

'నాయనా, మేం అడుగు తీసి అడుగు పెట్టే స్థితిలో లేం. మాకిప్పుడు కావలిసింది పట్టెడన్నం!' అన్నదా స్త్రీ.

'అయితే ఉండండి, ఇప్పుడే వస్తాను!' అంటూ గోవిందుడు పరిగెత్తి వెళ్లి తన సంచీ తెచ్చాడు. అందులో తన పిల్లలకోసం తెచ్చిన తినుబండారాలు ఉన్నాయి. వాటిని అతను కోటీశ్వరుడి పిల్లలకిచ్చి, తన దగ్గిర ఉన్న పదార్థాలతో ఆ అడవిలోనే వంట చేశాడు. కొద్ది సేపటిలో అందరూ అన్నాలు తిన్నారు. పోయిన ప్రాణాలు లేచి వచ్చిన

ట్లయింది వారికి. వారిని వెంటబెట్టుకుని గోవిందుడు దారిదాకా తెచ్చి, 'ఇక నాకు సెలవిప్పించండి!' అన్నాడు.

'అమ్మయ్యో, మేము ఇల్లు చేరలే! మమ్మల్ని ఇల్లు చేర్చి మరీ వెళ్లు!' అన్నది కోటీశ్వరుడి భార్య. ఆమె తన పిల్లలతో సహా ఇల్లు చేరి గోవిందుణ్ణి పంపేస్తూ, అతని చేతిలో ఒక చిన్న సంచీ పెట్టింది.

గోవిందుడు దాన్ని విప్పి చూసుకుంటే అందులో ఎనిమిది బంగారు కాసులు న్నాయి. ఒక్క నాడా మేకు ఇంత డబ్బు తెస్తుందని అతను కలలో కూడా అనుకో లేదు. అతను మరికొన్ని సరుకులు కొను క్కుని అడవి దారిన బయలుదేరాడు.

అడవి నడిమధ్యకు చేరుకునేసరికి అత నికి సమీపం నుంచి మనిషి మూలుగు వినిపించింది. అతను ఆ మూలుగు విని పించిన దిక్కుగా వెళ్లి, చెట్టుకు కొట్టేసి శోష పడి ఉన్న మంత్రి కొడుకును చూచాడు. మంత్రి కొడుకు హీన స్వరంలో తనకు జరిగిన ప్రమాదం గురించి గోవిందుడికి చెప్పాడు. గోవిందుడు అతని కట్లు విప్పి నడిపించుకుంటూ తన ఇంటికి తీసుకు పోయి కడుపునిండా తిండి పెట్టించాడు.

'బాబూ, తమరు మేకు లేని కారణం చేత ఎంత నష్టపోయారో, నేను దానితో అంత లాభం పొందాను,' అంటూ గోవిం దుడు తన కథ యావత్తూ చెప్పాడు.

అంతా విని మంత్రి కొడుకు, 'చూడు, గోవిందూ! సరిగా నీవంటి వాడొకడు నన్ను కనిపెట్టి ఉండటానికి నౌకరుగా కావాలి. నా వెంట నగరానికి వచ్చెయ్యి. నీకు మంచి ఇల్లు, జీతమూ ఇస్తాను!' అన్నాడు.

ఆ రోజే గోవిందుడు తన కుటుంబాన్ని తీసుకుని నగరానికి వెళ్లి మంత్రికుమారుడి వద్ద కొలువులో ప్రవేశించాడు.





# వంటలరాణి

ఓసారి శ్రీ కృష్ణదేవరాయలు మారువేషంలో నగరంలో తిరుగుతుంటే నాలుగు దారులు కలిసే చోట, ముసలమ్మ వెదురుబుట్టలో గారెలు, బూరెలు అమ్ముతూ కనిపించింది. దగ్గరకు వెళ్లగానే వాటి సువాసన ముక్కులకు తగిలి తినాలనే కోరికపుట్టింది. అది మధ్యాహ్నం కావడంతో కడుపులో ఆకలి కూడా కేకలు వేసింది. వెంటనే దగ్గరకు పోయి 'అవ్వా ఓ నాలుగు గారెలు ఇవ్వు,' అన్నాడు.

వెంటనే ఆ ముసలమ్మ మోదుగు ఆకులో ముందు గారెలు ఆపైన బూరెలు పెట్టి ఇచ్చింది. అది తినగానే ఎంతో మధురంగా అనిపించాయి. మరో నాలుగు పెట్టమని అడిగి 'నీ పేరేమిటన్నావు?' అనడిగాడు. 'ఆదెమ్మయ్యా. అందరూ ముసలమ్మనే పిలుస్తారయ్యా. మా ముసలోడు మాత్రం ఆది... ఆది అని పిలిచేవోడు,' అంది.

'డెబ్బయ్యేళ్ళ వయసులో కూడా గారెలు అమ్ముకుని జీవిస్తున్నావు. నీకు ఎవరూ లేరా?' అడిగాడు రాయలు మరో నాలుగు పెట్టమని సైగ చేస్తూ. ఆకులో మరో నాలుగు పెడుతూ 'నా భర్తపోయి నాలుగేళ్లవుతుందయ్యా. పిల్లలు కలగలేదు. ఎవర్నయినా తెచ్చి సాదుకుందామంటే, మా ముసలోడు ఒప్పుకోలేదు. నాకు నువ్వు. నీకు నేను పిల్లలము కాదా అనేవాడు. నేను చేసే ఈ రాగి బూరెలు, మినప గారెలంటే మా వోడికి మహా ఇష్టమండీ. ఒకనాడు పండగపూట పరమాన్నం తిని నిద్రలోనే పోయాడయ్యా,' అంది

పుప్పాల కృష్ణమూర్తి



ముసలమ్మ కంటనీరు పెట్టుకుంటూ.

మళ్లీ ఆకు చాపగానే మరో నాలుగు పెట్టింది. 'ఇంత రుచికరంగా చేయడం ఎవరి దగ్గర నేర్చుకున్నావ్?' అడిగాడు రాయలు గారెను నోట్లో పెట్టుకుంటూ.

'మా అమ్మ నేర్పిందయ్యా. మనిషన్నవాడికి ఏదో ఒక విద్య వచ్చి ఉండాలి. అదే కష్టకాలంలో ఆదుకుంటుందని చెప్పేది. మా వాడకట్టు ఆడవాళ్లంతా ఏ పండగొచ్చినా, నన్ను పిల్చుకుపోయి, పిండి వంటలు చేయించుకుంటారండి. మిగతా రోజుల్లో ఇంట్లోనే చేసి, ఇట్లా వచ్చి, బజారులో అమ్ముకుంటానండి. మా సచ్చినోడు అనేవాడండి. నీ చేతి వంట తినడానికి అదృష్టముండాలి ఆదీ, అని కొసరి కొసరి వడ్డించమనేవాడు మీ మాదిరిగానే,' అంది.

బుట్టను ఖాళీ చేసిన రాజు వరహాలు ఇస్తూ, 'నిజమే అవ్వా. నీ చేతి వంట తినాలంటే చాలా అదృష్టముండాలి. నాకింక రోజూ ఆ అదృష్టముంటుందనుకుంటున్నా,' అన్నాడు.

మరుసటి రోజు ఓ భటుడు వచ్చి, 'నిన్ను రాజుగారు ఉన్నఫళంగా తీసుకు రమ్మంటున్నాడు. పద కచ్చేరికి,' అన్నాడు.

భయపడి పోయింది ఆదెమ్మ. 'ఎందుకయ్యా? ఎందుకు? నేనేం తప్పు చేశానని?' అంది తత్తరపాటుగా.

'ఏమో, నువ్వు రాజుగారికి గారెలు, బూరెలు ఇచ్చావట గదా నిన్న. అందుకే రమ్మంటున్నాడు.'

'అయ్యా, నిన్న వచ్చి తిన్నవారు రాజుగారా? నేను గుర్తుపట్టలేదయ్యా. అయ్యా ఈ తప్పు మన్నించమని చెప్పు. గారెల్లో కాస్త ఉప్పు ఎక్కువైంది. బూరెల్లో తీపి తక్కువైంది. రాజు గారు వచ్చి తింటారని నాకేం తెలుసు. ఏదో దారిన పోయేవాళ్లు కొనుక్కుంటారని ఒకమాదిరిగా చేశాను. ఈ తప్పు కాయమని చెప్పయ్యా,' అంది వణికిపోతూ.

'కోపం మీదేం లేదులే. అయినా దిక్కులేని ముసలమ్మవు. నిన్నేమీ అనడులే.' అన్నాడు భటుడు వెంటబెట్టుకుని తీసుకుపోతూ. వెళ్లేసరికి రాజు సింహాసనం మీద ఉన్నాడు. ఆదెమ్మ ఒదిగి ఒదిగి నిలబడింది.

దగ్గరకు రమ్మన్నాడు. ఒణుకుతూ వెళ్లింది. 'భయపడకు, నిన్నేమీ అనను,' అని రాజు ధైర్యం చెప్పాడు.

ఆదెమ్మను సభకు చూపిస్తూ, 'ఈమె వయసు డెబ్బయి సంవత్సరాలు.అయినా ఎంత ఆరోగ్యంగా ఉందో చూడండి. ఎందుకంటే ఈమెకు చుట్టకాల్చడం, కల్లు తాగడం వంటి ఏ దురలవాట్లు లేవు. అంతే కాదు. ఈమె చేతిలో ఒక గొప్ప కళ ఉంది. అద్భుతంగా పిండి వంటలు చేయడం వచ్చు. ఎంత బాగా చేస్తుందంటే, నిన్న ఆమె చేసిన గారెలు, బూరెలు మొత్తం నేనే తినేశా. మనిషన్నవాడు ఏదో ఒక విద్యలో ప్రావీణ్యం సంపాదించాలని. వీళ్ల అమ్మ చెప్పిన మాటను పాటించి, వంటలో చాలా చక్కని నైపుణ్యాన్ని సంపాదించింది. ఆ నైపుణ్యమే ఈమెను ఈ సభకు రప్పించేలా చేసింది. ఈమెను చూసి రాజ్యంలోని స్త్రీలందరూ నేర్చుకోవాలి.' అని పరిచయం చేశాడు భుజం పట్టుకుని.

ఆదెమ్మకు కండ్ల వెంట జలజలా నీళ్లు కారాయి. నోట మాట రాలేదు. వంగి రాయలవారి పాదాలు అందుకుని 'అంతా మీ దయ,' అంది.

'నీ దగ్గర గొప్ప ప్రావీణ్యముంది. కన్న తల్లి చేతి వంట తింటే ఎంత రుచికరంగా అనిపిస్తుందో నీవు చేసిన పదార్థాలు కూడా అలాగే అనిపించాయి. నీ చేతి వంటకు నా మనసు ఉవ్విళ్లూరుతోంది. నిన్ను ఇప్పుడే మా భవనంలో వంట చేయడానికి వంటల రాణిగా నియమిస్తున్నాను. పనిలో పనిగా మా అంతఃపుర స్త్రీలకు కూడా వంట నేర్పు మరి,' అన్నాడు రాయలు.

'నా చేతి వంటను మహారాజు మెచ్చుకుని, రోజూ తింటానంటే నాకు అంతకన్నా అదృష్టమేముందయ్యా, నేను జీవించినంతకాలం మీకు చక్కని వంటలు చేసి పెడతా' అంది భరోసాగా.



# ప్రాప్తం

హేలాపురి నివాసి నాగేశం బతికి చెడ్డవాడు. తాతలు, తండ్రుల కాలం నాటి ఆస్తులన్నీ కరిగిపోయి నేటికి తనకంటూ స్వంత ఇల్లు కూడా లేక బాడుగ ఇంటిలో సంసారం గడుపు కొస్తున్నాడు. దానికి తోడు గంపెడు సంతానం. ఆరుగురు ఆడపిల్లలు, నలుగురు మగ పిల్లలు. అందులో నలుగురు ఆడపిల్లలు పెళ్ళికెదిగి వచ్చి నాగేశం దంపతుల గుండెల్లో గుబులు రేపుతున్నారు.

రోజూ కడుపునిండా తినడానికే లేని ఈ పరిస్థితిలో పిల్లల పెళ్ళిళ్లు ఎలా చేయాలో పాలు పోవడం లేదు నాగేశానికి. ఇటువంటి పరిస్థితిలో సంపదకోసం లక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకో వడం మినహా మరో దారిలేదని నిర్ణయించుకుని నాగేశం ఇంట్లో ఎవరికీ చెప్పకుండా అడవిలో తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు.

నాగేశం తపస్సుకు మెచ్చి లక్ష్మీదేవి ప్రత్యక్షమయింది.

'భక్తా! నీ భక్తికి మెచ్చాను. నీ అవసరాలన్నీ గ్రహించాను. నీకెంత సంపద కావాలో కోరుకో. ప్రసాదిస్తాను. కానీ ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకో. ఒకే ఒక్కసారి మాత్రం నువ్వు నాతో మాట్లాడే అవకాశం ఇస్తున్నాను. బాగా ఆలోచించుకుని నీకెంత సంపద కావాలో కోరుకో. అనుగ్రహిస్తాను', అన్నది లక్ష్మీదేవి.

నాగేశం తన అవసరాలన్నీ మననం చేసుకోసాగేడు. ఆరుగురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు. మంచి ఇల్లు, పొలాలు, మగపిల్లలకు మంచి జీవితాలు – వీటన్నిటికీ సరిపడే ధనం ఎంత? అంత సొమ్ము లక్ష్మీదేవి ఇవ్వగలదా? అనేక సందేహాలతో నాగేశం సతమతమవుతూ, 'అమ్మా! అసలు నీ దగ్గర ఎంత ధనముంది?' అని అడిగేడు.

'అంతులేనంత!' అని సమాధానమిచ్చి మాయమైపోయింది లక్ష్మీదేవి.

*– కోనే నాగ వెంకట ఆంజనేయులు*



# అందరికీ ఒకటే న్యాయం!

ఒక గ్రామాధికారి కింద ఒక పశువుల కాపరి ఉండేవాడు. అతడికి ఒక ఆవు ఉండేది. తన ఆవును తన యజమాని ఆవులతోబాటు రోజూ మేతకు తోలుకుపోతూ ఉండేవాడు.

ఒకనాడు దురదృష్టవశాత్తూ గ్రామాధికారి ఆవు ఒకటి పశువుల కాపరి ఆవుతో తలపడింది. రెండూ పోట్లాడుకున్న మీదట పశువుల కాపరి ఆవు గ్రామాధికారి ఆవును చంపేసింది.

పశువుల కాపరి వెంటనే గ్రామాధికారి వద్దకు వెళ్ళి, ''అయ్యా, మీ ఆవు నా ఆవుతో పోట్లాడి చంపేస్తే న్యాయంగా దానికి పరిహారం ఏమిటి?'' అన్నాడు.

గ్రామాధికారి తొణకకుండా, ''దానికి పరిహారం ఉండదురా, అబ్బీ! పోట్లాడు కోవటమూ, చంపుకోవటమూ పశుధర్మం. దానికి ఎవరూ ఏమీ చేయలేరు!'' అన్నాడు.

''మీరు సరిగా వినలేదులాగుంది. నా ఆవు మీ ఆవును చంపింది. నన్ను పరిహారం అడుగుతారేమోనని భయపడ్డాను. బతికించారు!'' అన్నాడు పశువుల కాపరి.





# మోసగాళ్లు

ఒక దేశంలో ఇద్దరు మోసగాళ్లు ఉండే వాళ్ళు. ఇద్దరూ సాధువులలాగా వేషాలు వేసుకుని ఊరూరా తిరుగుతూ, భూత వైద్యాలు చేస్తామనీ, తాయెత్తులు కడతామనీ చెప్పి, జనాన్ని మోసగించి డబ్బు సంపాదించి, తమ గుట్టు బయటపడే లోపుగా ఇంకొక గ్రామానికి వెళ్ళిపోతుండే వాళ్లు. పెద్దవాడు గురువునని చెప్పుకునే వాడు. చిన్న వాడు శిష్యుడినని చెప్పుకునే వాడు.

ఈ దొంగసాధువులు ప్రజలను మోస గించేవాళ్లు గనక, వాళ్లు ఇవాళ ఉన్న ఊళ్లో రేపు ఉండకుండా, ఈ నెల ఉన్న దేశంలో వచ్చే నెల ఉండకుండా సంచారం చేస్తూ వచ్చారు. అయినప్పటికీ వాళ్ల అపఖ్యాతి వాళ్లను తరుముకుంటూ రాసాగింది.

గురుశిష్యులు ఒక ఊరు చేరేసరికి అక్కడ వారి మోసం ఎరిగిన వాడొకడు తటస్థపడ్డాడు.ఆ మనిషి వాళ్లను అటకాయించి, 'మీరు దొంగలు! పచ్చి మోస గాళ్లు!' అని కేకలు పెట్టసాగాడు. వెంటనే పదిమందీ పోగయారు. వాళ్లకు అను మానం కలిగింది. ఇద్దరినీ పట్టుకుని మెత్తగా తన్ని, ఊరినుంచి సాగనంపారు.

ఇలా జరగగానే గురుశిష్యులిద్దరూ చెరొకదారీ అయిపోయారు. గురువుగారు చాలా రోజులు ప్రయాణం చేసి, ఒక పెద్ద పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఒక సత్రం అరుగుమీద చేరి, కళ్లు మూసుకుని కొంత సేపు బకధ్యానం చేశాడు.

ఈలోపుగా పనీ పాటాలేని జనం చాలా మంది చుట్టూ చేరారు. కొంతసేపటికి

ఎస్.మాధవరావు

సాధువు కళ్లు తెరిచి చుట్టూ చేరిన వాళ్ళను చూసి చిరునవ్వు నవ్వాడు.

'స్వామీ. తమరెవరు? ఎక్కడినుండి వస్తున్నారు? తమవద్ద ఏమి మహిమ లున్నాయి?' అని వాళ్లు అడిగారు.

'మాచేత కానిదేమున్నది? విభూతి మంత్రించి ఇస్తే సమస్త వ్యాధులూ మాయ మవుతాయి. తాయెత్తు కడితే గ్రహపీడలు పోతాయి. అన్ని రకాల గాలిచేష్టలు. కుదుర్చుతాము,' అన్నాడు సాధువు, గడ్డం నిమురుకుంటూ.

చుట్టూ చేరిన వారిలో కొంతమంది మంత్రించిన విభూతి తీసుకున్నారు. మరి కొద్దిమంది తాయెత్తులు పుచ్చుకున్నారు. హరిద్వారంలో మఠం కట్టించటానికని చెప్పి సాధువు వారివద్ద కొంత డబ్బు వసూలు చేశాడు. డబ్బు ఇవ్వాలనేసరికి తాయెత్తులు అడుగుదామనుకున్నవారు కొందరు అడగటం మానేశారు.

సరిగా ఆ సమయంలో శిష్యుడు అక్క డికి వచ్చాడు. తన గురువును చూశాడు. వెంటనే వాడు మండిపడుతూ, 'మళ్లీ ఇక్కడ దాపురించావా? దొంగ సన్యాసివాడా?' అన్నాడు. తరవాత వాడు చుట్టూ చేరిన జనం కేసి తిరిగి, 'అయ్యా, మీరెవరూ ఇతణ్ణి నమ్మకండి! వట్టి మోసగాడు! మొన్న మొన్నటిదాకా నేను ఈ మనిషికి శిష్యుణ్ణిగా ఉండి, ఇతను చేసే పాపంలో పాలుపం చుకున్నాను! నాకు బుద్ధి వచ్చింది! ఈ మనిషి వల్ల మీరు మాత్రం మోసపోకండి! ఇతడి దగ్గిర ఎలాంటి మహిమలూ లేవు,' అని కేకలు పెట్టాడు.



ఈ మాటలను కొందరు నమ్మి ముక్కు మీద వేలు వేసుకుని, 'ఎంత మోసం! ఎంత మోసం!' అన్నారు. గురువు వద్ద తాయెత్తులూ, విభూతీ కొనుక్కున్న వాళ్లు మటుకు ఆయన కేసి తిరిగి, 'ఎవడో దుర్మార్గుడు వచ్చి తమరిని ఇంతమాట అంటూంటే తమరు చూస్తూ ఊరుకుంటారేం? అనుమతి ఇవ్వండి, మెత్తగా తన్నేస్తాం!' అన్నారు.

గురువు గడ్డం నిమురుకుంటూ, 'అజ్ఞాని! వాడి పాపం వాడికే తగులుతుంది! వాడిమీద చెయ్యి చేసుకోకండి!' అన్నాడు.

ఈ మాటతో శిష్యుడు మరింత రెచ్చిపోయి గురువుకేసి తిరిగి, 'ఆ మాట అనక ఇంకేమంటావు? నీ బతుకంతా నాకు తెలుసును! ఎవరన్నా నన్ను అంటుకున్నారో, నీ గుట్టంతా బయటపెట్టేస్తాను!' అని మళ్లీ బిగ్గరగా అరిచాడు.

గురువు మోసగాడే అయి ఉంటాడన్న నమ్మకం అక్కడ చేరినవారికి కలగసాగింది. ఈలోగా గురువు లేచి నిలబడి, 'ఓరీ! నీవు మితిమీరి పోతున్నావు! ఈ అమాయకులు నీ మాటలు నమ్ముతారని నీ ఉద్దేశం! కాని నిజం పలికే భగవంతుడున్నాడురా మూర్ఖా! నేను దొంగనే అయితే ఈ కప్పు విరిగి నామీద కూలుగాక. నీ మాటలు అబద్ధమే అయితే ఇదుగో అనుభవించు!' అంటూ తన కమండలంలోనుంచి ఇన్ని నీళ్లు తీసి శిష్యుని మీద చల్లాడు.

మరుక్షణం శిష్యుడు మొదలు నరికిన చెట్టులాగా కిందపడి, కొద్దిసేపు గిలగిలా



తన్నుకుని, శరీరం కొయ్యబారి శవంలాగా అయిపోయాడు.

ఆ దృశ్యం చూడగానే 'చచ్చాడు, చచ్చాడు!' అని నలుగురూ హాహాకారాలు చేశారు.

'మహిమ కలవాళ్లను నిందిస్తే ఊరికే పోతుందా?' అని కొందరన్నారు. 'సామాన్యపు సాధువనుకుని నోటికి వచ్చినదల్లా వాగాడు! రోగం వదిలింది!' అన్నారు ఆ ఊళ్ళోని మరి కొందరు.

'స్వామీ మీ మహిమ తెలియక ఘోరాపరాధం చేసాడు. దయచేసి వాణ్ణి క్షమించండి!' అని కొంత మంది గురువును బతిమాలారు. కాసేపటి తర్వాత గురువు తన జోలెలోనుంచి ఒక తాయెత్తు బయటకు తీసి శిష్యుడి చేతికి కట్టి, 'నిన్ను క్షమించాము ఇక లేవరా!' అన్నాడు.

శిష్యుడు అప్పుడే నిద్రలేచినవాడిలాగా కళ్ళు తెరిచి లేచి కూచుని, చుట్టూ కంగారుగా చూసి చివరకు గురువుకేసి చూసి ఒక్కసారిగా ఏడుస్తూ ఆయన కాళ్లమీద పడి 'క్షమించండి, స్వామీ! ఘోరమైన తప్పు చేసాను,' అని వేడుకున్నాడు.

'క్షమించాము పోరా! ఇకపై ఎన్నడూ సాధువుల జోలికి రాకు!' అన్నాడు గురువు.

శిష్యుడు కళ్లు తుడుచుకుంటూ లేచి ఎటో వెళ్లిపోయాడు.

తరవాత అక్కడ చేరిన వారందరూ గురువు వద్ద తాయెత్తులు కొని బోలెడంత డబ్బు ఇచ్చారు.

అప్పుడు గురువు ఆ పట్టణం నుంచి బయలుదేరి కొంత దూరాన శిష్యుడిని కలుసుకుని తాను సంపాదించిన డబ్బులో సగం వాడికిచ్చేశాడు.

మళ్ళీ వాళ్ళిద్దరూ చీలి ఇంకొకనగరానికి ప్రయాణమై, అక్కడ కూడా ఇదే నాటకం ఆడటానికి బయలుదేరి వెళ్లిపోయారు.





# గురువుగారి ఆంతర్యం

వైశాలీ దేశపు రాజు చిత్రగుప్తుడు మంచి పరిపాలనాదక్షుడు.ఆయన తన రాజ్యంలోని ప్రజలను కన్నబిడ్డల్లా కాపాడేవాడు. కాని చిత్రగుప్తునికి సంతానం కలుగక పోవడంతో క్రమంగా రాజ్య వ్యవహారాల పట్ల ఆయనకు ఆసక్తి తగ్గుతూ వచ్చింది. రాజభక్తుడయిన మంత్రి సునందునికి ఇది ఉచితంగా తోచ లేదు. ఎందుకంటే రాజు అలసత్వం చూపితే శత్రువులు బలపడి రాజ్యం అచిరకాలం లోనే చెయ్యి జారిపోతుంది. అందుకే సునం దుడు కుల గురువు పరమానందులవారి ఆశ్రమానికి వెళ్లి రాజుగారికి సంతానం కలి గేందుకు ఏదయినా మార్గం సూచించమని వారిని వేడుకున్నాడు.

పరమానందులవారు చిత్రగుప్తుడు పుత్ర కామేష్టియాగం చేస్తే తప్పక సంతానం కలు గుతుందని సలహా చెప్పారు. చిత్రగుప్తుడు ఆయన సలహాననుసరించి దేశవిదేశాల నుండి ఋత్విక్కులను రప్పించి వారి ఆధ్వ ర్యంలో పుత్ర కామేష్టి యాగం చేసాడు. రాజు గారికి ఏడాది తిరక్కుండానే కవలపిల్లలు ఉదయించారు. వారికి గురువుగారిచేతనే జయవిజయులని నామకరణం చేయిం చాడు చిత్రగుప్తుడు.

రాజుగారితో పాటు మంత్రి సునందునికీ పుత్ర జననం అయింది. తన కుమారునికి సుబుద్ధి అని పేరు పెట్టుకున్నాడు సునం దుడు. కొంతకాలం తర్వాత ముగ్గురినీ విద్యాబుద్ధులకై పరమానందులవారి ఆశ్ర మానికి పంపించారు. సుబుద్ధి వినమ్రంగా విద్యనార్జించేవాడు. జయవిజయులు పోటీ పడి ఎంతో ఉత్సాహంతో గురువుగారివద్ద అన్నివిద్యలనూ నేర్చుకున్నారు. శౌర్యపరా క్రమాల్లోను, ఆలోచనా విధానంలోను జయ విజయులు అంచనాలకు మించే ఉండే వారు తప్ప వెనక్కి తగ్గేవారు కాదు.

పి.వి.శేషారత్నం

వారి విద్యార్జన పూర్తవుతున్న సమయానికి మంత్రి సునందుడు రాత్రికి రాత్రి రహస్యంగా పరమానందులవారిని కలుసుకుని రాజుగారి విన్నపాన్ని వినిపించి వెళ్లిపోయాడు.

పరమానందులవారు మరుసటి దినం ముగ్గురు యువకులను పిలిచి తాను వారికి ఒక పోటీ పరీక్ష పెడుతున్నట్టుగా ప్రకటించారు.

తాను తలపెట్టిన ఒక మహిమాన్వితమైన యాగానికి ప్రారంభంలో ప్రతిష్ఠించవలసిన మూడు విగ్రహాలను తయారుచెయ్యమని గ్రామానికి పశ్చిమదిశలో నివాసముండే ఒక శిల్పికి ఇంతకు ముందే సూచించానని, అతను తయారుచేసి ఉంచిన విగ్రహాలను ఎటువంటి నష్టం కలగకుండా భద్రంగా తీసుకుని మరుసటిరోజు అపరాహ్న సమయంలోగా ముహూర్తం మించిపోకుండా ఆశ్రమానికి చేరుకోవలసిందిగా ఆదేశించారు.

'ఇంత చదువు చదివి ఇదేం పరీక్ష?' అనుకున్నాడు జయుడు. 'గురువుగారి ఆంతర్యం ఆచరిస్తేగానీ అర్థంకాదు.' అనుకున్నాడు విజయుడు. సుబుద్ధి మాత్రం ఆలోచనలో పడ్డాడు.

గురువుగారి ఆదేశాన్ని శిరసావహిస్తూ జయవిజయులు, సుబుద్ధి ఎంతో ఉత్సాహంగా శిల్పి ఉన్న గ్రామానికి బయలుదేరారు.

వారు గ్రామం చేరేసరికే రాత్రి బాగా పొద్దుపోయింది. ఇంక తప్పనిసరిగా వారు అక్కడ విశ్రమించాల్సివచ్చింది. మరునాడు తెల్లవారుజాముకు కాస్త ముందుగానే ముగ్గురూ బయలుదేరేందుకు సిద్ధమవు



తుండగా హఠాత్తుగా వారిని బందిపోటు దొంగలు చుట్టుముట్టారు. వారినెదుర్కొనకుండా ముందుకు కదలిపోవడం అవమానంగా భావించిన జయుడు వెంటనే కత్తి దూశాడు.

విజయుడు కూడా వారికి సాయం వెళ్లబోతుండగా సుబుద్ధి లక్ష్యాన్ని గుర్తుచేసాడు. 'గురువుగారు నిర్దేశించిన శిల్పిని కలుసుకోవాలంటే మనలో కనీసం ఒక్కరయినా ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా వెంటనే బయలు దేరకపోతే లక్ష్యం నెరవేరదు. నేను ఇక్కడే ఉండి జయునికి సాయం చేస్తాను. తమరు ముందుకు సాగిపొండి.' అన్నాడు సుబుద్ధి.

విజయుడు పశ్చిమదిశవైపు వేగంగా కదిలాడు. ఇక్కడ జయుడు తన పరాక్రమంతో సుబుద్ధి సహకారంతో దొంగలను తరిమి



కొట్టాడు. అదంతా కళ్లారా చూసిన గ్రామ స్థులు అతని పరాక్రమాన్ని పొగుడుతూ సన్మానించేందుకు సన్నాహాలు చేస్తుంటే జయుని భుజాలు ఆనందంతో పొంగాయి. కాని సుబుద్ధి గురువుగారి ఆదేశాన్ని గుర్తు చేసాడు. జయుడు వాస్తవంలోకి వచ్చి సుబుద్ధితో కలసి పయనమయ్యాడు.

ఈలోగా విజయుడు గురువుగారు చెప్పిన శిల్పిని కలుసుకుని మూడు విగ్రహాలను అతి భద్రంగా పట్టుకుని మార్గమధ్యం లోనే సుబుద్ధి, జయులను కలుసుకున్నాడు. ఎవరి విగ్రహాలు వారు అందుకున్నారు. అయితే అప్పటికే గురువుగారు చెప్పిన ముహూర్తపు గడువు దగ్గరయిపోతూండే సరికి ముగ్గురూ వేగం పెంచారు.

వాళ్లు వస్తున్న దారిలో నలుగురు పిల్లలు కూడి ఆనందంగా ఆటాడుకుంటున్నారు. ఇంతలో అనుకోకుండా ఎక్కడి నుంచో బలమైన గుర్రాలను పూన్చిన ఒక రథం వేగంగా రావడం కనిపించింది.అదే వేగంతో వస్తే అక్కడ ఆదమరచి ఆడుకుంటున్న పిల్లలు దానిక్రిందపడి నలిగిపోవడం ఖాయం...

జయుని దృష్టి పోటీలో నెగ్గడంమీదనే ఉంది. ఒకరిద్దరు చిన్నపిల్లల ప్రాణాల కంటె గురువుగారికి సమయానికి విగ్రహం అందజేయడమే ప్రధానంగా భావించి చేతిలోని విగ్రహంతో అతడు వేగంగా ముందుకు కదలిపోయాడు. సుబుద్ధి మాత్రం ఆగలేదు గాని విజయునివైపు సానుకూలంగా చూసి విగ్రహంతో కదలిపోయాడు.

అక్కడ ఆడుకుంటున్నవారిలో ముగ్గురు పెద్దపిల్లలు రథాన్ని చూసి కంగారుపడినా పక్కకి దొర్లి వెంట్రుకవాసిలో తప్పించుకున్నారు. ఒక చిన్నపిల్లమాత్రం బెంబేలెత్తిపోయి ఏంచెయ్యాలో తోచక గట్టిగా ఏడుపు లంకించుకుంది.

విజయుని ముందు రెండే అవకాశాలు. పాప ప్రాణం.. విగ్రహం భద్రత.

పాపను తప్పించాలంటే విగ్రహాన్ని కిందకి వదిలిపెట్టక తప్పదు. దెబ్బతిన్న విగ్రహం ప్రతిష్టకు పనికిరాదు. గురువుగారి ఆదేశాన్ని ఉల్లంఘించి ఆగ్రహానికి గురికావలసివుంటుంది. క్షణకాలం కూడా ఆలోచించలేదు విజయుడు. విగ్రహాన్ని అక్కడే జారవిడచి ముందుకు దూకి పాపను రథచక్రాల క్రింద నలిగిపోకుండా కాపాడగలిగాడు. అయితే విగ్రహం చెయ్యి విరిగి అతని కష్టమంతా కళ్లముందే కరిగిపోయింది. వెనుక నుంచి ఆపిల్ల తల్లిదండ్రుల దీవెనలు వినిపిస్తున్నా

విజయుడు ఆగకుండా కదలిపోయాడు. అప్పటికే జయుడు, సుబుద్ధి గురువుగారికి తాము తెచ్చిన విగ్రహాలను ముహూర్తం లోగా భద్రంగా అందించి గురువు ప్రశం సలు అందుకున్నారు.

విజయుడు మాత్రం విరిగిన విగ్రహంతో పరమానందులవారి ఎదుట తలదించుకుని దోషిలా నిలబడ్డాడు.

ఇంతలో రథం దిగిన మహారాజు చిత్రగు ప్తుడు, మంత్రి సునందుడు పరమానందుల వారికి నమస్కరించారు.

పరమానందులవారు అతి ప్రసన్నంగా మహారాజును చూస్తూ 'రాజా!నా పరీక్షలో నెగ్గిన విజయుడే రాజ్యాభిషేకానికి అర్హుడు' అన్నారు.

చిత్రగుప్తుడు ఆశ్చర్యంగా ఏదో అనబో తోంటే మంత్రి సునందుడు అందుకు న్నాడు. మహారాజా! గురువుల ఆంతర్యం నాకు అర్థమయింది. గురువుగారి ఆదేశమే వేదమని జయుడు విగ్రహంమీదే దృష్టి నిలిపాడు. కాని పరీక్షలో ఓడిపోతానని తెలిసి కూడా ప్రాణప్రతిష్ట చేయాల్సిన విగ్రహం కంటె మనిషి ప్రాణం ఎక్కువ విలువైనదని భావించాడు విజయుడు, విగ్రహానికి పట్టిన గతి పాపకు పట్టకూడదనే కావాలని ఓడి పోయి గెలిచాడు.'

పరమానందులవారు శాంతంగా అన్నారు. 'అవును మహారాజా! ప్రజల ప్రాణ రక్షణే రాజుకి ముఖ్యం. అది నెరవేర్చి విజయుడు రాజ్యపాలనకు అర్హుడయ్యాడు. అలాగని జయుడు తక్కువవాడుకాడు. పరాక్రమవం తుడు. నేను పంపిన బందిపోట్లను చక్కగా ఎదుర్కొన్నాడు. అందుకే అతడు సైన్యాధ్యక్ష పదవికి అర్హుడు. తనపని తాను చేసుకుం టూనే వీళ్లిద్దరికీ ఎవరికి తగిన సలహా వారికి చ్చిన సుబుద్ధి మంత్రి పదవికి అన్నివిధాలా అర్హుడు.' చిత్రగుప్తుడు ఆనందభరితుడ య్యాడు.

అనంతరం విజయుడు పట్టాభిషిక్తుడై వైశాలీ దేశాన్ని ప్రజారంజకంగా పాలిస్తూ తండ్రిని మించిన తనయుడనిపించుకు న్నాడు.






# ఆలోచన - ఆచరణ

ముకుందపురంలో అరవిందుడు అనే యువకుడు వ్యవసాయం చేసుకుంటూనే, గ్రామాభివృద్ధికి ఇతోధికంగా సేవ చేసేవాడు.

ఆ గ్రామస్థులు నిత్యమూ గోదావరి మధ్య ఉన్న లంకలో పనులకు వెళ్లి వస్తూండేవారు. గ్రామానికీ ఏటిగట్టుకూ నడుమ కాలువ ఉంది. ఆ కాలువను దాటడానికి తాటిచెక్క వంతెనలా వేయబడింది. ఆ తాటి వంతెన పైన నడుస్తూ అప్పుడప్పుడూ కొందరు కాలు జారి కాలువలో పడిపోవడం కద్దు.

అందువల్ల కాలువ పైన వంతెన నిర్మించ వలసిందిగా గ్రామ పంచాయితీని కోరాడు అరవిందుడు. అందుకు నిధులు లేవన్నారు సభ్యులు. పోనీ గ్రామస్థులంతా చందాలు వేసుకుని వంతెనను తామే నిర్మించుకుందా మంటే ఎవరూ ముందుకు రాలేదు.

అందువల్ల అరవిందుడు తన స్వంత సొమ్ముతో బల్లకట్టు తయారు చేయించాడు. దాన్ని నడిపేందుకు నియమింపబడ్డ వ్యక్తికి నెలనెలా జీతం ఇచ్చేందుకు ఊరి పంచాయితీ అంగీకరించింది. కాలువ దాటడానికి తాటిచెక్క వంతెన పోయి, బల్లకట్టు రావడంతో గ్రామస్థులు కూడా ఎంతో సంతోషించారు.

అదే గ్రామంలో ఉండే నాగేంద్ర అనేవాడికి ఎవరు ఏ పని చేసినా విమర్శించడం అలవాటు. 'కాలువపైన వంతెన నిర్మించక, బల్లకట్టు వేస్తే సరిపోతుందా? దానిని నడిపే వాడికి జీతం ఇవ్వడం వల్ల పంచాయితీ నిధులు దండుగే కదా!' అంటూ విమర్శించాడు. ఆ మాట అరవిందుడి చెవికి చేరినా ఏమీ అనలేదు.

ఓసారి అరవిందుడు తన ఎడ్ల బండిలో పొరుగూరికి బైలు దేరాడు. ఏటి ఒడ్డమ్మటా వెళ్తూంటే, దారిలో ఎండలో నడిచి వెళ్తున్న తన ఊరివాళ్లు కొందరు కనిపించారు. వారిని

తిరుమలశ్రీ

పిలిచి బండి ఎక్కించుకున్నాడు అరవిందుడు. వారిలో నాగేంద్ర కూడా ఉన్నాడు. ఎడ్లు పరుగెత్తకుండా నెమ్మదిగా నడుస్తుంటే కమ్చీ కోలతో వాటిని కొట్టి అదిలిస్తున్నాడు అరవిందుడు.

అది చూసిన నాగేంద్ర 'ఎడ్లను కొట్టి పని చేయించడమూ ఓ గొప్పేనా! వీపు మీద ప్రేమతో నిమిరితే అవే చెప్పిన మాట వింటాయి,' అంటూ అలవాటు ప్రకారం విమర్శించాడు నాగేంద్ర.. అరవిందుడు ఇప్పటికీ ఏమీ అనలేదు.

మరికొంత దూరం వెళ్లేసరికి ఎడ్లు నత్త నడకన నడవటం చూసిన అరవిందుడు నాగేంద్రతో 'నువ్వు చెప్పింది నిజమేననిపిస్తోంది. నేను వెనక కూర్చుంటాను. నువ్వు ముందుకు వచ్చి బండి నడుపు' అన్నాడు.

నాగేంద్ర ఉలికిపడి, 'బండి నడపడం నాకు చేతకాదు.' అన్నాడు కంగారుగా.

'ఎడ్లను ఎలా మచ్చిక చేసుకోవాలో తెలిసినవాడివి, బండి నడపలేవా?' అన్నాడు అరవిందుడు అచ్చెరపాటుతో.

'దారి తెలిసినంత మాత్రాన మోటారు శకటాన్ని నడపటం అందరికీ చేతనౌతుందా?' అన్నాడు నాగేంద్ర.

అప్పుడు అరవిందుడు నవ్వి ఇలా అన్నాడు. 'ఓ మంచి పని చేయాలన్న ఆలోచనా, ఎలా చేయాలన్న ఊహా అందరిలోనూ ఉంటాయి. వాటిని ఆచరణలో పెట్టడంలోనే ఉంటుంది కష్టమంతాను. ఆలోచన వేరు, ఆచరణ వేరూను. నీటిలో దిగితే కాని లోతు తెలవనట్లే, ఓ పనిని ఆచరిస్తే కాని అందులోని సాధకబాధకాలు తెలిసిరావు. ఇతరులు చేసే పనిని విమర్శించడం తేలికే. ఆ పనిని స్వయంగా చేయడమే కష్టం.. విమర్శ కోసమే చేసే విమర్శలు హాని కలిగిస్తాయి. వాటివల్ల ఓ మంచిపని చేయాలనుకునే వారు వెనక్కి తగ్గే ప్రమాదం ఉంది.'

అరవిందుడు తన పొరపాటును సున్నితంగా ఎత్తిచూపడంతో, నాగేంద్ర తన తప్పు తెలుసుకున్నాడు. ఆ తర్వాత ఎన్నడూ ఏ విషయంలోనూ అనవసరంగా అనాలోచితంగా విమర్శలకు పూనుకోకపోవడమే కాక, ఇతరులు చేసే మంచిపనులకు తన వంతు సాయం చేయనారంభించాడు.



# ఎద్దుబాధ

శ్రీరంగాపురంలో భూస్వామి రామేశం కొత్తగా ఓ ఎద్దుల జతను కొన్నాడు. వాటిలో ఒకటి చురుగ్గానే పనిచేస్తున్నా, మరొకటి మాత్రం పదే పదే మొరాయించసాగింది. బలవంతపెడితే కదలకుండా కూర్చుంటోంది. పనిచేయని ఆ ఒక్క ఎద్దును అమ్మడం అసాధ్యమని భావించి, రెండింటినీ విక్రయించాలనుకున్నాడు రామేశం. ఒకనాడు రామేశం మిత్రుడు స్వరవర్మ పొరుగూరు నుంచి వచ్చాడు. అతను సామాన్య రైతు. 'వర్మా.. ఇటీవలే కొన్న నా ఎద్దులజతను సగంధరకే అమ్మాలని నిర్ణయించుకున్నాను. వాటిని చూసి నచ్చితే కొనుగోలు చేసుకువెళ్ళు. పైకం కూడా నీకు వీలున్నప్పుడివ్వు.' అన్నాడు రామేశం.

పక్కనే పాకలో ఉన్న ఎడ్లను పరీక్షించిన స్వరవర్మ వాటిని కొని తనవెంట తీసుకెళ్ళాడు. అంత సులువుగా అవి అమ్ముడవడం రామేశానికి ఆనందం కలిగించింది. అయితే ఓ నెల గడిచాక ఎద్దులతో స్వరవర్మ ఎలా నెగ్గుకొస్తున్నాడో తెలుసుకోవాలనిపించింది. వెంటనే స్నేహితుని గ్రామం బయలుదేరాడు. దారిలోనే ఉన్న పొలం వద్ద స్వరవర్మ కనిపించాడు.

అక్కడ తను అమ్మిన ఎడ్లు ఎంతో శాంతం పొలాన్ని దున్నడం గమనించాడు రామేశం. ఇబ్బంది పెట్టిన ఎద్దు కూడా ఎంతో హుషారుగా నాగలి లాగుతోంది! ఎంతో ఆశ్చర్యం కలిగింది.

మిత్రుడి అనుమానం గమనించిన స్వరవర్మ, 'ఎద్దుల్ని కొనడానికి ముందే వాటి పరిస్థితి నీ పనివాళ్ళ మాటల ద్వారా తెలిసింది. వాటిని పరీక్షించి, ఏ లోపం లేదని నిర్ధారించుకున్నాకే కొన్నాను. ఎద్దు మొండికేయడానికి కారణం.. నీకున్న విశాలమైన, గట్లులేని పొలాన్ని చూసి గొడ్డుచాకిరీ చేయాలని అది భయపడడమే! మోర ఎత్తితే గట్లు కనిపించే నా చిన్న కమతాన్ని ప్రయాస లేకుండా దున్నుతోంది. నువ్వు దాని బాధను అర్థం చేసుకోలేకపోయావు.' అన్నాడు.

సందేహ నివృత్తి కలగడంతో రామేశం సంతోషించి, మిత్రుడి అంచనా సామర్థ్యాన్ని ఎంతగానో పొగిడాడు.

– ఎస్.సుధారాణి





# శిథిలాలయం -24

*(చిరుతపులీ, మొసళ్ల బారినుంచి జాంగ్‌లాను శిథిలాలయ పూజారి ముతా రక్షించింది. ఆ రాత్రి కొండచరియ ప్రాంతాన నిద్రిస్తున్న శిఖిముఖినీ, అతడి అనుచరులకూ ఇభ్యజాతి వాళ్లు పట్టుకుని తమ పల్లెకు తీసుకుపోయారు. వాళ్ల కులపెద్ద కాళీమాతకు బలి ఇచ్చేందుకు శిఖిముఖి అనుచరులను తమ నాయకుడెవరో చెప్పమన్నాడు. తరవాత--)*

ఇభ్యుల కులపెద్ద, శిఖిముఖీ వాళ్లను అడిగిన ప్రశ్న వింటూనే శిథిలాలయ పూజారి మహదానంద పడిపోయాడు. అతడికి, ఈ దెబ్బతో శిఖిముఖి కాళీమాతకు బలి అయిపోతాడనీ, ఆ ఆటవికుడి సహాయం కోల్పోయిన విక్రమకేసరిని తేలిగ్గా హతమార్చవచ్చనీ అనిపించింది.

'ఇభ్య నాయకా! మీరు వాళ్ళను ఆ ప్రశ్న అడగనవసరం లేదు. వాళ్ల నాయకుడెవరో తెలుస్తూనే ఉన్నది కదా! ఆ ఆటవికుడు శిఖిముఖి శిథిలాలయం పేరుతో ధనాశ చూపి తతిమ్మా ముగ్గురినీ ఇంత దూరం తీసుకువచ్చాడు,' అన్నాడు శిథిలాలయ పూజారి. ఆ మాటలు వింటూనే ఇభ్య కులపెద్ద కోపంగా తల తిప్పి అతడికేసి చూశాడు. ఇభ్య మాంత్రికుడు తన చేతిలోని దండంతో పూజారి వీపుమీద పొడిచి, 'కులపెద్ద అనుమతి ముందుగా తీసుకుని తరవాత మాట్లాడాలి! ఆపాటి మర్యాద కూడా నీకు తెలియదా?' అన్నాడు.

పూజారి చిన్నగా మూలిగి చేత్తో వీపు తడువుకున్నాడు. ఇభ్య కులపెద్ద మరోసారి మొదట వేసిన ప్రశ్నను శిఖిముఖీ, విక్రమకేసరుల కేసి చూస్తూ గట్టిగా అడి

దాసరి సుబ్రహ్మణ్యం



గాడు. విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో శిఖిముఖి అతడిని వారించి, 'పూజారి చెప్పినట్టు నేనే ఈ అందరికీ నాయకుడిని. కాని అతడన్నట్లు నేను వీళ్లను ధనాశ చూపి ఇంత దూరం తీసుకు రాలేదు. మేము ఈ ప్రాంతాలకు వచ్చింది విక్రమకేసరి అనే మహారాజు కోసం. ఆయన ఈ ప్రాంతాల ఎక్కడో ఉన్నాడని సమాచారం అందింది,' అన్నాడు.

విక్రమకేసరి అన్న మాట వింటూనే ఇభ్యు కులపెద్ద ఉలిక్కిపడ్డాడు. ఇది గమనించిన పూజారి, 'ఇభ్యునాయకా, మీ అనుమతితో మాట్లాడుతున్నాను. విక్రమ కేసరి మహారాజు రాకాపోకా అంతా ఏళ్లూ పూళ్లూ నాటి మాట గదా? వీళ్లు ఆయన పేరు ఎక్కడో విని, ఆ పేరు చాటున కపట నాటకం ఆడుతున్నారు. వీళ్లు నిజంగా వచ్చింది, శిథిలాలయంలోని వెండి బంగారాలు దోచుకు పోయేందుకు,' అన్నాడు.

ఇభ్యు కులపెద్ద తలాడించి ఒకటిరెండు క్షణాలు మౌనంగా ఊరుకుని, తరవాత శిఖిముఖిని, 'మిమ్మల్ని గురించి నాకు సర్వం తెలుసు. అనవసర ప్రసంగం వద్దు. మీలో నాయకుడెవరు?' అని అడిగాడు కఠినంగా.

'చెప్పాను కదా, నేనే నాయకుణ్ణి! నా పేరు శిఖిముఖి!' అంటూ శిఖిముఖి ఒకడుగు ముందుకు వేశాడు. విక్రమకేసరి అతడి భుజం పట్టుకుని లాగుతూ, 'నేను రాజవంశం వాణ్ణి, క్షత్రియుణ్ణి! నాకు ఆటవికుడు నాయకుడెలా కాగలడు? వీళ్ల ముగ్గురికీ నాయకుణ్ణి నేను. నా పేరు విక్రమకేసరి. ఆ కాళీమాతకు నన్నే బలిపెట్టండి. కాని, బలి అయిపోయే ముందు మీలో కొందరినైనా బలి పుచ్చుకు తీరతాను,' అన్నాడు రౌద్రంగా.

శిథిలాలయ పూజారి పెద్దగా నవ్వుతూ, 'ఎంత మోసం! తన పేరు విక్రమ కేసరి అని పచ్చి అబద్ధం ఆడేస్తున్నాడు. పైగా ఇభ్యు జాతి వాళ్లను బలి పుచ్చుకుంటాడట. అహ్హాహ్హా!' అన్నాడు.

విక్రమకేసరి మాటలు ఇభ్యు కుల పెద్దకు బాగా కోపం తెప్పించినై. అతడు తన అనుచరుల్ని హెచ్చరిస్తూ, 'ఈ శిఖి



ముఖీ, విక్రమకేసరులమని చెప్పుకునే వాళ్లిద్దరూ ప్రమాదకారుల్లా ఉన్నారు. తక్షణం ఇద్దర్నీ కాళీమాతకు బలియ్యండి. మిగతా ఇద్దరి సంగతీ తరవాత ఆలోచిద్దాం. నడవండి, కాళీమాత ఆలయానికి,' అంటూ ఆసనం మీదనుంచి లేచి బయలుదేరాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ ముఖాముఖాలు చూసుకున్నారు. వాళ్లకు ఇక ఇభ్యు కుల పెద్దతో మాట్లాడి ప్రయోజనం లేదన్న భావం కలిగింది. తమకు మరణం ఎలాగు తప్పదు, కాని వెంట వచ్చిన అజిత వీరభద్రులు అనవసర కష్టాలపాటు అవుతారన్న భయం ఇద్దర్నీ బాధించసాగింది. ఇభ్యు కులపెద్ద వెనకగా అందరూ చుట్టు గుడిసె నుంచి బయటకు వచ్చి, పెద్ద వీధి వెంట కొంత దూరం నడిచి, గ్రామానికి అల్లంత దూరంలో ఒక ఎత్తయిన ప్రదేశంలో ఉన్న కాళికాలయాన్ని చేరారు.

ఇభ్యు మాంత్రికుడు చేత కత్తి పట్టుకుని భయంకర రూపంలో ఉన్న కాళికాదేవి విగ్రహం ముందుకు పోయి, పెద్ద స్వరంతో ఏవో మంత్రాలు చదివి, కట్లు విప్పి 'ఇక ఆ శిఖిముఖి, విక్రమ కేసరి అనేవాళ్లను దేవి ముందుకు తీసుకురండి,' అన్నాడు.

మాంత్రికుడి ఆజ్ఞ శిథిలాలయ పూజారికి చాలా సంతోషం కలిగించింది. అతడు ఇభ్యు కుల పెద్ద పక్కన చేరి పనిలో పనిగా అజిత వీరభద్రుల్ని కూడా దేవికి బలి పెట్టడం బావుంటుందని సలహా ఇచ్చాడు. దానికి కులపెద్ద అవును కాదన్నట్లుగా తల ఊపసాగాడు. అతడి దృష్టి విక్రమకేసరి మీదే కేంద్రీకరించబడి ఉన్నది. విక్రమ కేసరి ముఖకవళికల్లో అతడికి తాను బాగా ఎరిగిన ఒక వ్యక్తి ముఖలక్షణాలు ఛాయా మాత్రంగా కనిపించసాగినై.

శిఖిముఖి వాళ్లను కొండచరియ దగ్గర పట్టుకున్న ఇభ్యు దళనాయకుడు, శిఖిముఖిని, విక్రమకేసరిని సమీపించి వాళ్ల భుజాలు పట్టుకుని, కత్తి ఎత్తి సిద్ధంగా ఉన్న ఇభ్యు మాంత్రికుడి ముందుకు తోయబోయాడు. అదే అదనుగా విక్రమ కేసరి గుప్పెట బిగించి ఇభ్యు దళనాయ

కుడి తలమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు వాడు దిమ్మెరపోయి కింద పడేం తలో, శిఖిముఖి మాంత్రికుణ్ణి కాలుతో బలంగా ఒక్క తన్ను తన్నాడు. మాంత్రి కుడు ఒక్క కేక పెట్టి పక్కకు పడిపో యాడు. అతడి చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది. శిఖిముఖి ఆ కత్తిని దొరకపుచ్చుకునేందుకు ముందుకురికేం తలో, ఇద్దరు ఇభ్యులూ, శిథిలాలయ పూజారి బంటొకడూ అతడి మీద పడి చేతులు విరిచి పట్టుకొన్నారు. విక్రమకేసరి అతడికి సహాయం వెళ్లేలోపల అతడి మీద మరి నలుగురు ఇభ్యులు వచ్చి పడి, కదలకుండా పట్టుకున్నారు.

క్షణంలో జరిగిపోయిన, ఈ గందర గోళం చూసి ఇభ్య కులపెద్దకు ఆశ్చర్యం, కోపం కూడా కలిగింది. అతడు కళ్లెర్రచేసి, మీసం మెలివేస్తూ శిఖిముఖి ముందుకు పోయి, అతడి మెడ పట్టుకుని, 'కాళీమాత ముందు నువ్వు చేసిన అపచారానికి నిన్ను చిత్రవధ చేయిస్తాను! ఈ విక్రమకేసరి అని చెప్పుకునేవాణ్ణి...'

ఇభ్యకుల పెద్ద మాట ముగించే లోపల శిఖిముఖి తన మెడపట్టు వదిలించుకునేం దుకు విసురుగా పక్కకు తిరిగాడు. ఆ ఊపుకు ఇభ్యకుల పెద్ద చేయి పట్టు తప్పి, శిఖిముఖి మెడలో ఉన్న రక్షరేకు మీద పడి తాడుతెగి, అతడి చేతిలోకి వచ్చింది. రక్షరేకు మీద గల కాళీమాత రూపం చూస్తూనే ఇభ్యకుల పెద్ద ఓ క్షణకాలం నిర్విణ్ణుడై పోయి, అంతలోనే తెప్పరిల్లి చేయెత్తి, 'వీళ్లిద్దరికీ ఎలాంటి





హానీ కలిగించకండి. ఇదేదో వింతగా ఉంది!' అంటూ రక్షరేఖను అటూ ఇటూ తిప్పి పరీక్షించసాగాడు.

శిఖిముఖీ, విక్రమకేసరులు క్షణాల మీద కాళికాదేవికి బలైపోతారని ఎదురు చూస్తున్న శిథిలాలయ పూజారికి, ఇభ్యు కులపెద్ద మాటలు చాలా ఆశాభంగం కలిగించినై. అతడు జంకుతూ జంకుతూ అతణ్ణి సమీపించి భుజం మీదుగా వంగి రక్షరేకు కేసి చూసి పళ్లు కొరికాడు.

'ఇభ్యునాయకా! ఇది పచ్చి మోసం! దైవద్రోహం! ఈ దేవాలయం లోని పవిత్రమైన కాళీమాత రూపానికి, ఈ నాస్తిక వెధవలు నకళ్లు తయారు చేయించి, మెడల్లో వేళ్లాడకట్టుకు తిరుగుతున్నారు. ఎంత అపచారం! ఎంత అపచారం!' అంటూ శిఖిముఖి కేసి దూకబోయాడు పూజారి.

ఇభ్యు కులపెద్ద అతడిని చేతితో వెనక్కు నెట్టి, 'కొంచెంసేపు నీ వాగుడు కట్టిపెట్టు!' అని గట్టిగా హెచ్చరించి, శిఖిముఖిని, 'ఈ రక్షరేకు నీకెక్కడ దొరికింది?' అని అడిగాడు. శిఖిముఖి పళ్లు కొరుకుతూ, ఇభ్యు కుల పెద్దకేసి చూసి, 'ఆ రక్షరేకు నాకెక్కడ దొరికిందో నీకు చెప్పవలసిన అవసరం ఏమిటి? ఆ రాగిముక్క గురించి నీవు తెలుసుకోవలసిందేమీ లేదు,' అన్నాడు.

'దైవదూషకా! అది రాగిముక్కా! జగజ్జనని కాళీమాతనా నువ్వవమానిస్తున్నది! చూస్తారేం, వాడి తల నరకండి!' అంటూ శిథిలాలయ పూజారి అరిచాడు.

ఇభ్యుకులపెద్ద కళ్లెర్రచేసి, పూజారి కేసి తిరిగి, 'నువ్వు కావటానికి ఇభ్యుడివైనా, ఏవో దుష్టశక్తులు సంపాయించేందుకు నీచోపాసన చేస్తూండటం తెలిసే నిన్ను కులంలో నుంచి బహిష్కరించాం. అటువంటి బహిష్కృతుడివి నువ్వు ఇక్కడ పెద్దరికం చేయాలని చూశావో, ముందు నిన్ను బలిపెడతాను,' అన్నాడు.

ఆ హెచ్చరికతో పూజారి అదురుకుని వెనక్కు తిరిగి తన అనుచరులకు సంజ్ఞ చేశాడు. దాంతో అందరూ అతడి చుట్టూ మూగారు. శిఖిముఖికి, ఇభ్యు కులపెద్ద అన్న మాటలూ, అతడు రక్షరేకును పరీక్షిస్తున్న తీరూ చూసి చాలా ఆశ్చర్యం కలి

గింది. ఆ వెంటనే అతడికి ఆ రక్షరేకు విక్రమకేసరి తాతగారివయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరికింది అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అంతే కాక దాని సాయంతో తామందరం బయట పడవచ్చునేమో అన్న ఆశ కూడా కలిగింది.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూసి అతడూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు గమనించి, చప్పున ఇభ్య కులపెద్ద కేసి తల తిప్పి, 'ఇభ్యనాయకా! నీలో ఏ మూలనో కొంచెం మానవత్వం ఉన్నదన్న సంగతి, ఇంతకుముందు నీవు అన్నమాటల వల్ల గ్రహించాను. ఆ పూజారి పరమ దుర్మార్గుడు. అది అలా ఉంచుదాం. ఈ రక్షరేకు మా మహారాజైన విక్రమకేసరికి ఎవరో బహుకరించారు. అది ఆయన వదిలిపోయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరకగా, దాన్ని ఆయన కుమారుడైన శూరసేనదేశపు రాజు జయపాలుడు నాకు స్వయంగా మెడలో కట్టాడు,' అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఇభ్యకుల పెద్ద అదిరిపడి, శిఖిముఖి కేసి, విక్రమకేసరికి ఓ మారు చూసి, ఒక్క అంగలో విక్రమకేసరిని సమీపించి, అతడిని గట్టిగా కావిలించుకుని, 'నువ్వు ఆ మహారాజు విక్రమకేసరి మనవడివా? మా జాతివాళ్లను మహమ్మారి రోగానికి బలికాకుండా కాపాడిన ఆ మహారాజు వంశాంకురానికి ఎంతద్రోహం చేశాను!' అంటూ కళ్లనీళ్లు పెట్టాడు. తమ



కులపెద్ద ఇలా అనగానే, అక్కడ చేరిన ఇభ్యులూ, ఇభ్యమాంత్రికుడూ, ముందుకు వచ్చి వాళ్లిద్దరి ముందూ చేతులు కట్టుకుని నిలబడ్డారు.

ఇభ్య కులపెద్ద, శిఖిముఖిని దగ్గిరకు పిలిచి, సాదరంగా అతడి భుజం మీద చేయివేసి, రక్షరేకును తిరిగి అతడి మెడలో వేలాడకడుతూ, 'ఇప్పుడు మీరేం చెప్పకుండానే, నాకు మీరు వచ్చిన పని చాలా వరకు తెలిసిపోయింది. మీరు ఆ మహారాజు సజీవుడేమో అన్న అనుమానంతో వెతుకుతూ బయలుదేరి ఇక్కడకొచ్చారు. కాని, ఆయన ఎక్కడో కొండల్లో విషజ్వరంతో చాలా కాలం బాధపడి మరణించారు. ఆయన మీది భక్తికొద్దీ ఆయన

మృతదేహాన్ని తెప్పించి, మా పూర్వుల సమాధి పక్కనే సమాధి చేయించాను. ఈ రక్షరేకును ఆ మహానుభావుడికి కృతజ్ఞతా సూచకంగా లోగడ నేనూ, నా జాతి వాళ్లమూ ఇచ్చాము,' అన్నాడు.

శిఖిముఖి ఆ మాటకు నవ్వి, 'మీరు మేం చెప్పేది సాంతం వినకుండానే మమ్మల్ని కాళికాదేవికి బలి ఇవ్వజూపారు. మిమ్మల్ని అపమార్గం పట్టించిన వాడు, ఆ దుర్మార్గుడైన శిథిలాలయ పూజారి. ముందు వాణ్ణి పట్టి బంధించండి. వాడు మాకూ మీకూ చేసిన ద్రోహం చాలా ఉంది,' అన్నాడు.

ఇభ్య కులపెద్ద పళ్లు కొరుకుతూ తన కులంవాళ్ల కేసి తిరిగి 'ఆ నీచుడెక్కడ? లాక్కురండి! కాళీమాతకు బలి ఇవ్వండి!' అంటూ అరిచాడు. మందిరంలో ఉన్నవాళ్లంతా చుట్టూ కలియచూశారు. అక్కడ పూజారి గాని అతడి అనుచరులు గాని లేరు. ఇభ్య కులపెద్దతో పాటు అందరూ 'ఆ నీచుడిని పట్టుకోండి!' అంటూ మందిరం నుంచి బయటికి పరుగెత్తుకొచ్చారు.

కాళీదేవి మందిరం ఉన్న గుట్టకు పక్కనే ఉన్న ఒక పెద్ద కొండమీద శిథిలాలయ పూజారీ, అతడి బంట్లూ నిలబడి ఉన్నారు. ఇభ్యకుల పెద్దను చూసి అతడు, 'ఈ మహాశక్తిమంతుడు, మీకు పట్టుబడతాడా? ఇన్నాళ్లకు నాకు శిథిలాలయం ఎక్కడున్నదో తెలిసిపోయింది. చేవ ఉంటే అక్కడికి రండి, మీరో నేనో తేల్చుకుందాం!' అంటూ కేక పెట్టాడు.

ఇభ్యకులపెద్ద తన వాళ్లకేసి తిరిగి 'ఆ సంకరజాతి వెధవను ప్రాణాలతో పట్టుకొచ్చిన వాడికి నా పదో భార్య చిన్నకూతుర్నిచ్చి పెళ్లి చేస్తాను.' అన్నాడు పెద్దగా.

ఇభ్య యువకులూ, నడివయసు వాళ్లూ పులుల్లా రంకెలు వేస్తూ, పూజారి నిలబడి ఉన్న కొండమీదికి వేగంగా పరిగెత్తసాగారు. (ఇంకా ఉంది)



# ప్రేరణ

అమ్మా! నా మార్కుల కార్డును ఒకసారి చూస్తావా? వినీత్ పాఠశాల నుంచి ఇంటికి రాగానే అమ్మతో అన్నాడు. 'ఎందుకు చూడనూ? చూపించు!' ఆసక్తితో అడిగింది అమ్మ. వినీత్ అందివ్వగానే తల్లి అతడి మార్కులను పైకే చదివేసింది. 'అన్నింట్లోనూ 80 పైగా మార్కులు! చాలా సంతోషంరా!' అంటూ కుమారుడి తలను ప్రేమగా నిమిరింది. కాని అతడు సంతోషంగా లేడని, ఏదో అతడిని బాధిస్తోందని ఆమె గుర్తించింది.

'వినీత్! ఏదైనా ఇబ్బందిగా ఉందా' అని లాలనగా అడిగింది.

'అమ్మా! ప్రసాద్‌కి 65 శాతం మార్కులు వచ్చాయి. ఆ మాత్రానికే వాడేదో సాధించేసినట్లుగా మా మిస్ పొగిడారు. అందరికంటే ఎక్కువ మార్కులు సంపాదించింది నేను. కాని ఆమె నా గురించి ఒక్క మాట చెప్పలేదు. ఎందుకీ పక్షపాతం ఆమెకు?' వినీత్ నిట్టూర్చాడు.

'అవునా! ప్రసాద్‌కు గతంలో ఎన్ని మార్కులు వచ్చాయి నాన్నా?' అమ్మ అడిగింది. 'కేవలం 40 శాతం మార్కులు మాత్రమే తెచ్చుకున్నాడు.' చెప్పాడు వినీత్. తల్లి అందుకుంది. 'ఇప్పుడు అతడు 65 శాతం మార్కులు తెచ్చుకున్నాడు. అట్టడుగు స్థానం నుంచి అతడు అన్ని మార్కులు సంపాదించాడు. మరిన్ని మార్కులు సాధించడానికి అతడికి ప్రోత్సాహం, ప్రేరణ అవసరం మరి. అందుకే మీ టీచరమ్మ అతడి స్థైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పెంచాలని ప్రయత్నించారు. వినీత్, ఇతరులనుంచి నీవు ప్రశంస కోసం ఎదురు చూడవద్దు. నీమీద నీవే పోటీపడటానికి ప్రయత్నించు, ప్రతి పరీక్షలోనూ నీ సామర్థ్యాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించు. దీనికి ప్రశంసలతో పనిలేదు. అర్థమైందా?'

'అర్థమయిందమ్మా!' చెప్పాడు వినీత్. 'నీకు నా కృతజ్ఞతలు!'

'తెలివి తక్కువగా మాట్లాడకురా!' అమ్మ వినీత్‌ని పొదువుకుంటూ చెప్పింది. 'నిన్ను ప్రేమించే వ్యక్తులకు నీవెప్పుడూ కృతజ్ఞత చెప్పవద్దు.' – ఆర్. బృంద





# చెట్టునీడ

ఒక గ్రామంలో ఒక ఆసామీ ఇంటి ముందు పెద్ద చెట్టుండేది. వేసవి కాలంలో దాని నీడలో చల్లగా ఉండేది. ఆసామీ అక్కడికి వచ్చి కూచుంటూ ఉండేవాడు.

ఒకనాటి మధ్యాన్నం ఆయన భోజనం చేసి చెట్టుకింద కూచోటానికి వచ్చేసరికి అక్కడ ఒక అలగావాడు కూచుని ఉన్నాడు.

'ఇదేమిటి? నిన్నిక్కడ ఎవరు కూచోనిచ్చారు? పద పద!' అని ఆసామీ అలగావాణ్ణి అదిలించాడు.

'ఎందుకు బాబూ, అలా కోప్పడతారు? ఎండ జాస్తిగా ఉంది. నీడలో చల్లగా ఉందని కూచున్నాను!' అన్నాడు అలగావాడు మర్యాదగా.

'అదేమీ కుదరదు. ఈ చెట్టు నా చెట్టు. నేను దీనికి ఎన్నో ఏళ్లుగా నీళ్లు పోసి పెంచి ఇంత చెట్టు చేశాను. అందుచేత దీని నీడ కూడా నాదే,' అన్నాడు ఆసామి. 'అలా చెప్పరేం! అయితే ఒక పని చేయండి. ఈ నీడ నాకు అమ్మండి, డబ్బిస్తాను!' అన్నాడు అలగావాడు.

డబ్బు మాట వినేసరికి ఆసామీకి ఆశ పుట్టుకొచ్చింది. 'సరే అమ్ముతాను. ఏమిస్తావు?' అన్నాడాయన.

బేరం కుదిరింది. ఇద్దరు ముగ్గురు దారే పోయేవాళ్ల సమక్షంలో అలగావాడు ఆసామీకి డబ్బిచ్చి చెట్టునీడను తను కొనేసుకున్నాడు.

అది మొదలు అలగావాడు రోజూ వచ్చి చెట్టునీడను కూచుంటూండేవాడు: దారిన ఎరిగున్న వాళ్లెవరన్నా పోతుంటే వాళ్లను కూడా పిలిచి నీడలో కూచోబెట్టేవాడు. అలా వచిన వాళ్లవెంట పశువులుంటే అవి కూడా నీడలో చేరేవి.

కె. ఇందుమతి

ఇది చాలక, నీడ కొన్న అలగావాడు మరొక పని చేయనారంభించాడు. ఆ చెట్టునీడ ఎక్కడెక్కడ పడిందో అక్కడికల్లా వెళ్లేవాడు. సమయాన్ని బట్టి, రుతువును బట్టి ఆ చెట్టునీడ ఆసామీ ఇంటి ఆవ రణలోనూ, పంచలోనూ, పడకగదిలోనూ, నడవలోనూ పడేది. అలగావాడు మొహ మాటం లేకుండా నీడ పడిన చోటికల్లా వెళ్లి తిష్టవేసేవాడు. ఇదంతా చూసి ఆసామికి మండిపోయింది. 'ఏయ్! మా దొడ్లోకీ, వసారాలోకీ, గదిలోకీ వచ్చి కూచునేటం దుకు నీకే హక్కున్నది?' అని ఆయన అలగావాణ్ణి గద్దించి అడిగాడు.

'బాబుగారు, నేను మీ చెట్టునీడను డబ్బు పోసీ కొనుక్కున్నాను. అది ఎక్కడె క్కడ పడుతుందో అక్కడల్లా కూచోవడానికి నాకు హక్కున్నది!' అన్నాడు అలగావాడు.

ఆసామి రుసరుసలాడాడు. కాని తాను తన చెట్టు నీడను ఆ పేదవాడికి అమ్మిన మాట నిజమే.

ఒక రోజు ఆసామి ఇంట ఏదో అక్కర అయింది. చుట్టాలనూ బంధువులనూ పిలిచి విందు చేస్తున్నాడు. వారంతా భోజనం చేసే చోట చెట్టునీడ పడింది. సమయానికి అలగావాడు చక్కా వచ్చి ఆ నీడలో కూచున్నాడు.

వచ్చిన అతిథులకు ఇదేమీ అర్థం కాలేదు. 'పిలవని పేరంటంగా వచ్చి ఈ మనిషి ఎవడో ఇక్కడ చతికిలబడ్డాడే మిటి?' అని వారు ఒకరినొకరు ప్రశ్నించు కున్నారు.

అలగా వాడు తాను నీడ కొనుక్కున్న వైనమంతా వాళ్లకు చెప్పేశాడు.

ఈ వింత సంగతి వింటూనే అక్కడ ఉన్న అతిథులందరూ గొల్లున నవ్వారు.

ఆసామికి నలుగురిలోనూ తల తీసేసిన ట్లయింది.

ఆ మర్నాడే ఆయన తన కుటుంబంతో సహా ఆ గ్రామం విడిచి మరో దూరగ్రామా నికి వెళ్లిపోయాడు.



# గడ్డంలో గడ్డిపరక

ఒక రోజున అక్బర్ చక్రవర్తి శయనాగారంలోని అల్మారా నుంచి ఖరీదైన ఒక నగను ఎవరో దొంగలించారు.

అక్కడ పనిచేస్తుండే నౌకర్లలో దొంగ ఎవడో తెలుసుకునేదెట్లా? అక్బర్ దొంగను పట్టే పని వీరబల్‌కు ఒప్పచెప్పాడు.

వీరబల్ నగ పోయిన అల్మారా దగ్గిరకు వెళ్లి, దాంట్లో తల దూర్చి, కొంచెం సేపు ఏదో వింటున్నట్టుగా నటించి, తరవాత అక్బర్ కేసి తిరిగి, 'ఈ అల్మారా, దొంగను దొరకపుచ్చుకునే మార్గం చెప్పింది. ఆ నగ దొంగిలించినవాడి గడ్డంలో ఒక చిన్న గడ్డిపరక ఉంటుందట!' అన్నాడు.

వీరబల్ ఇలా అనగానే అక్కడున్న నౌకర్లలో ఒకడు వేళ్లతో గడ్డం సవరించు కున్నాడు.

వీరబల్ వాణ్ణి పట్టుకుని ప్రశ్నించేసరికి, వాడు బెదిరిపోయి దొంగిలించిన నగ తెచ్చిఇచ్చాడు.





# విత్తనం గింజ

ఆరో తరగతి చదివే కిరణ్ ఆ రోజు బడికి రాలేదు. ప్రతిరోజూ నియమం తప్పక బడికి వచ్చే కిరణ్ ఆ రోజు ఎందుకు రాలేదో మాధ వయ్య పంతులు గారికి అర్థం కాక, మిగతా పిల్లల్ని ఆరా తీశాడు. అందరూ తమకు తెలియదనే సమాధానం ఇచ్చారు.

ఆ మరునాడు కూడా కిరణ్ బడికి రాలేదు. కారణం ఏమై ఉంటుందో కనుక్కుందా మని బడి వదలగానే మాధవయ్య కిరణ్ ఇంటికి దారితీశాడు.

కిరణ్ తండ్రి సూరయ్య ఆ గ్రామంలో పేరుకు రైతే గానీ, ఉన్న ఒక ఎకరంలో వచ్చే ఫలసాయం అంతంత మాత్రమే. భార్యా భర్తలిద్దరూ మిగతా రైతుల పొలాల్లో కూలీ లుగా పనిచేస్తారు. పోయిన సంవత్సరం వర్షాలు సరిగా కురవక కరువు పరిస్థితులు ఏర్పడినై. వాళ్ళ రెక్కల కష్టంతో అప్పు దీర్చడం మాట దేవుడెరుగు వడ్డీలు కట్టలేక పూట గడవని కష్టమొచ్చిపడింది. కిరణ్‌ని పశులు కాయడానికి పంపితే తిండి గింజలు కొలుస్తానని భుజంగం చెప్పడంతో గత్యం తరం లేక సూరయ్య కొడుకును ఆ పని లోకి పంపాడు.

ఆ విషయం మాధవయ్య చెవిన పడ గానే ఆయనకు కోపం వచ్చింది. ఎందు కంటే కిరణ్ చాలా తెలివైనవాడు. తరగతిలో ఎప్పుడూ అందరికంటే ముందుంటాడు. కష్టపడి చదువుకుంటే వాడు భవిష్యత్తులో గొప్పవాడవుతాడని మాధవయ్య నమ్మకం.

మాధవయ్య వెళ్లేసరికి సూరయ్య ఇంటి ముందు పెద్దగొడవగా ఉంది. సూరయ్యకు అప్పు ఇచ్చిన పెద్దమనిషి రెండు మూడు నెలలుగా వడ్డీ చెల్లించడం లేదేమిటని అతన్ని నిలదీస్తున్నాడు. రెండు మూడు రోజుల్లోగా సర్దుబాటు చేస్తానని సూరయ్య అతడిని బతిమాలుకుంటున్నాడు. మాధ

దాసరి వెంకట రమణ



కుని రేపు వాడు ఎంత గొప్ప వాడవుతాడో తెలుసా? వాడిని పనిలో పెట్టి చాలా తప్పు చేశావు సూరయ్యా! అసలు చిన్నపిల్లవాడిని పనిలో పెట్టడం నేరం.. తెలుసా?' అన్నాడు.

'తెలియదయ్యా!..... ఆకలి తప్ప మా కేమీ తెలియదు. రేపటి సంగతి ఏమో కానీ ఇప్పుడు మాత్రం పూట గడవటం లేదు,' స్థిరంగా అన్నాడు సూరయ్య.

తన కుటుంబం ఆర్థిక పరిస్థితి గురించి తెలియచేసి కిరణ్‌ని ఎందుకు పనిలో పెట్ట వలసివచ్చిందో మాధవయ్యకు పూస గుచ్చి నట్లు వివరించాడు సూరయ్య. మాధవయ్య రకరకాల ఉదాహరణలతో ఎన్నో విధాలుగా నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. కాని సూరయ్య నిర్ణయంలో మార్పు లేదు. చివ రికి తాను కొంత ఆర్థిక సహాయం చేస్తానని, కిరణ్‌ని పనిమానిపించి బడికి పంపమని అడిగాడు. కాని సూరయ్య అందుకు ఒప్పు కోలేదు.

వయ్య అక్కడికి రావడం చూస్తూనే ఆ పెద్ద మనిషి 'రెండు రోజుల తర్వాతే వస్తాను,' అంటూ అక్కడి నుండి వెళ్లిపోయాడు. సూరయ్య మాధవయ్యకు నమస్కరించి, కూర్చోబెట్టి కుశల ప్రశ్నలడిగాడు. మాధ వయ్య సూరయ్య మర్యాదలను పట్టించు కోకుండా 'కిరణ్ ఎక్కడ?' అని సూటిగా అడిగాడు.

సూరయ్య మాట్లాడలేదు. మాధవయ్య వంక చూసే ధైర్యం లేక నేలచూపులు చూడసాగాడు. మాధవయ్య గద్దించి అడి గిన మీదట సూరయ్య మెల్లగా పెదవి విప్పాడు. ఏ పరిస్థితుల్లో తన కొడుకును భుజంగం దగ్గర పనిలో పెట్టాడో వివరిం చాడు.

మాధవయ్య కోపం ఎక్కువైంది. 'కిరణ్ గురించి మీకు తెలుసా? బాగా చదువు

చేసేది లేక నిస్సహాయంగా వెనుదిరుగ బోతున్న మాధవయ్యకు వసారాలో పై అరుగు మీద కొన్ని ధాన్యపు బస్తాలు కని పించాయి. వెంటనే 'అవేమిటి?' అని సూరయ్యను అడిగాడు. 'విత్తనం కోసం దాచిన ధాన్యం అయ్యగారూ!' అన్నాడు సూరయ్య.

ఎంత ఆకలికైనా ఓర్చుకుంటాడు కానీ రైతు విత్తనం కోసం దాచిన ధాన్యం ఏ పరి స్థితుల్లోనూ తిండికి ఉపయోగించడు. సూరయ్యను ఒప్పించడానికి మాధవయ్యకు మరొక మార్గం దొరికినట్లయింది. 'పూట గడవటం లేదు అంటున్నావే అక్కడ అన్ని

బస్తాల ధాన్యం ఉంది, వండుకొని తినొచ్చు కదా!' అన్నాడు సూరయ్యతో.

'మీకు తెలియంది ఏముంది అయ్యగారూ! అది విత్తనం కోసం దాచిన ధాన్యం. దాన్ని తింటే రేపు తొలకరికి చేలో విత్తనం ఏమి వేస్తాము?' అన్నాడు సూరయ్య. అంతలో పశువులు కాయడానికి పోయిన కిరణ్ ఇంటికి వచ్చాడు.

మాధవయ్య వాడిని దగ్గరికి తీసుకుని తల నిమురుతూ, సూరయ్యను అతడి భార్యను కూర్చోమని చెప్పి, హితవు పలికాడు. 'చూడు సూరయ్యా! పిల్లలు పుట్టగానే వాళ్లు మనకే సొంతమనే భ్రమలో ఉంటాం. దాదాపు వాళ్లను మన ఆస్థిలో భాగంగా భావిస్తాం. వాస్తవానికి పిల్లలు జాతీయ ఆస్తులు. ఒక ఎకరం పొలమున్న నీవే విత్తనం గింజల్ని ఇంట్లో ఇంత జాగ్రత్త చేస్తున్నావే... మరి జాతీయ ఆస్తులైన ఈ పిల్లలు కూడా విత్తనంల్లాంటివారే వారిని మరెంత జాగ్రత్తగా పోషించాలి? నువు పొలంలో విత్తనం వేస్తే మొలిచే మొక్క ఏం కాయ కాస్తుందో నీకు ముందే తెలుస్తుంది. కానీ ఈ పిల్లలనే మొక్కలు పెరిగి పెద్దవారై జాతికి ఎటువంటి ఫలాలు అందిస్తారో మనం కనీసం ఊహించను కూడా ఊహించలేం. నీ కొడుకు చదువుకుంటే చాలా గొప్ప వాడవుతాడు. నీవు ఎందుకు వాడికి కిరణ్ అని పేరు పెట్టావో కానీ వాడు రేపు నీ కుటుంబానికే కాదు మానవ జాతికే వెలుగవుతాడు. వాడి మీద నాకు చాలా నమ్మకం ఉంది. నా మాటవిని రేపటి నుండి వాడిని బడికి పంపించు.'

ఆ మాటతో సూరయ్య మెత్తబడ్డాడు. అతని మనసు సమాధానపడ్డది. భవిష్యత్తు పట్ల చిన్న ఆశ కలిగింది. తమకు ఎంత కష్టం కలిగినా పిల్లవాడిని పని మాన్పించి బడికి పంపాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు. మాధవయ్య నమ్మకం వమ్ముకాలేదు. కిరణ్ బాగా చదువుకుని ఎంతో మంది జీవితాల్లో వెలుగు నింపి గురువులు, తల్లిదండ్రులు, ఆ గ్రామం యావత్తూ గర్వపడేలా, దేశానికే పేరు తెచ్చేంత గొప్పవాడయ్యాడు.





# అట్టమీది బొమ్మ - జటాయువు సాహసం

శ్రీ ఎంటివి ఆచార్య గారు 1948 జూలై చందమామ సంచికకు వేసిన ముఖచిత్రాన్ని ఈ సంచికలో మళ్లీ ప్రచురిస్తున్నాము. రామాయణం కేవలం మహాకావ్యమే కాదు. అది వ్యక్తిగతంగా, సాంస్కృతికంగా కూడా మనకు స్ఫూర్తి కలిగిస్తుంది. అది అనేక అద్భుతమైన చిన్న పాత్రలతో కూడి ఉంది. వీటిలో జటాయువు ఒకటి.

జటాయువు పేరు విన్నారు కదూ? జటాయువు పెద్ద పక్షి. అది రెక్కలు విప్పితే ఆకాశం కప్పినట్లయ్యేది. అది కాళ్లతో తన్నితే పెద్ద పెద్ద రథాలు బోర్లపడేవి. అంత పెద్ద బలశాలి అది.

రామలక్ష్మణులు లేని సమయంలో రావణుడు సీతాదేవిని దొంగిలించి పుష్పకరథం మీద లంకకు తీసుకుపోతున్నాడు. పాపం! సీతాదేవి ఏం చేస్తుంది? చెట్లతో, పుట్టలతో, కొండలతో, గుట్టలతో, నదులతో, వాగులతో, అన్నింటితోనూ ఈ వార్త రాముడితో చెప్పమని మొరపెట్టింది. జటాయువు అప్పుడు ఒక చెట్టుమీద కూర్చుని కునుకుతున్నది. ఈ కేకలు విని చెవినపడి లేచి, రావణుడి రథానికి అడ్డం వెళ్లింది. రావణుడు బాణాలు వేశాడు. జటాయువు వాటిని లెక్క చేయకుండా కాళ్లతో రావణాసురుడి రొమ్ము మీద తన్నింది. గుర్రాలను ఒక్క దెబ్బకు చంపింది. రావణాసురుడు బాగా భయపడి రథాన్ని వదిలి సీతాదేవిని పట్టుకుని భూమిమీదకు దిగాడు. జటాయువు కూడా కిందికి దిగివచ్చి రావణుడి మొహాన తన్నింది. అతని కిరీటం పోయి దూరంగా పడింది. అప్పుడు రావణుడు చప్పున కత్తి తీసి జటాయువు రెక్కలు నరికి వెళ్లాడు. రెక్కలు పోవడంతో జటాయువు కూలబడి పోయింది.

అలాగే కొనవూపిరితో రాముడు అక్కడికి వచ్చేవరకూ పడి ఉండి, సీతాదేవి వార్త అతనికి చెప్పి చనిపోయింది. జటాయువు మరణానికి రాముడు చాలా విచారపడ్డాడు. దానికి దహన సంస్కారాలు చేసి స్వర్గం ఇచ్చాడు. చూశారా, జటాయువు త్యాగం? తను గెలవలేనని తెలిసి కూడా అధర్మం జరుగుతుంటే ఓర్చలేక చివరివరకు పోట్లాడింది!

ఇతరులకు సాయపడటంలో ముసలితనం జటాయువును అడ్డుకోలేకపోయింది. ఎవరైనా ఇబ్బందుల్లో ఉన్నప్పుడు సాయం చేసే మంచి బుద్ధిని ప్రదర్శించటానికి స్థిర చిత్తాన్ని కలిగి ఉండాలని జటాయువు కథ మనకు బోధిస్తుంది.

- సౌమ్యా భరద్వాజ్

# కెరీర్ అంటే?



చిత్రలేఖనంలో సహజమైన ప్రతిభ కలిగి ఉంటే వారు ఎంచుకోవలసిన ఉత్తమ కెరీర్ ప్రొఫెషనల్ కార్టూనిస్ట్‌గా మారటమే. కార్టూనిస్ట్‌గా స్థిరమైన కెరీర్ కోసం రచన, చిత్రలేఖనం, అక్షరాలు చెక్కడం, రంగులద్దడం వంటి వాటిలో నైపుణ్యం సాధించాలి. ఇందుకు వృత్తిపరమైన శిక్షణ పొందాలి. భావాలు, ఆలోచనలు, అనుభూతులను వ్యక్తపరచడానికి కార్టూన్ పాత్రలను ఉపయోగించేవాడే కార్టూనిస్టు. దాదాపు ప్రతి వార్తాపత్రిక, ప్రచురణ సంస్థ, వెబ్‌సైట్ లేదా పత్రిక వివిధ అంశాలపై సందేశాలను వ్యక్తపరచడానికి కార్టూన్‌లను ఉపయోగిస్తున్నాయి.

కార్టూనిస్టు అనేక నైపుణ్యాలను కలిగి ఉంటాడు. బొమ్మలు గీయడంలో అతడికి సహజసిద్ధ ప్రతిభ ఉంటుంది. అతడు మంచి పరిశీలనతో, తన చుట్టూ జరుగుతున్న ఘటనలకు సంబంధించిన సూక్ష్మ వివరాలను కూడా పసిగట్టగలిగిన తత్వాన్ని కలిగి ఉంటాడు. ఎలాంటి పదాలను ఉపయోగించకుండా బొమ్మ సాయంతో ఒక సీరియస్ అంశాన్ని మలచడం చిన్న విషయం కాదు. ఇది సవాలుతో కూడుకున్నదీ, ప్రశంసలకు నోచుకునే పని కూడా. కార్టూనిస్టులు చేతిద్వారా లేదా కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ ద్వారా 2 డైమెన్షనల్, 3 డైమెన్షనల్ చిత్రాలను రూపొందించడంలో చక్కటి శిక్షణ పొంది ఉంటారు. పెన్, ఇంక్, పెన్సిల్, పేస్టల్, ఆక్రిలిక్స్, వాటర్ కలర్స్ వంటివి వీరు ఉపయోగించే పరికరాలు.

సంస్థ ద్వారా కోర్సును పూర్తి చేసిన కార్టూనిస్టులు (నేషనల్ అసోసియేషన్స్ ఆఫ్ స్కూల్స్ ఆఫ్ ఆర్ట్ అండ్ డిజైన్) ఉద్యోగాలు పొందడానికి చక్కటి అవకాశం కలిగి ఉంటారు. ఈ రంగంలో కంప్యూటర్లు, వాటికి సంబంధించిన గ్రాఫిక్ సాఫ్ట్‌వేర్ ఉపయోగించడం పెరుగుతున్న కారణంగా కార్టూనిస్టులు కూడా వివిధ కంప్యూటర్ టెక్నిక్‌లలో శిక్షణ పూర్తి చేయాలి. అవసరమైన ఆచరణాత్మక అనుభవాన్ని పొందడంలో ఇంటర్న్‌షిప్‌లు కీలక పాత్ర పోషిస్తాయి. భారతదేశంలో కార్టూనింగ్ కోర్సులను ప్రతిపాదిస్తున్న కొన్ని సంస్థలు:-

- *Global School of Animation & Games, New Delhi*
- *National Institute of Design (NID, Ahmedabad)*
- *Arena Multimedia*
- *J.J School of Arts*
- *Indian Institute of Cartoonists*
- *Zee Institute of Creative Arts (ZICA)*
- *Industrial Design Center (IDC), IIT - Mumbai & Guwahati*
- *Academy of Animation and Gaming*

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ – 38

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

***Co-sponsored by Infosys FOUNDATION, Bangalore***

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి `250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు `50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ –38 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జూన్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ఆవిష్కరణలు




1. ప్రయాణీకులను మోసుకుపోయే ఎలివేటర్‌ను 1852లో కనిపెట్టిందెవరు?
2. మొట్టమొదటి బాల్ పాయింట్ పెన్‌ను 1938లో ఎవరు కనుగొన్నారు?
3. ప్రెషర్ కుక్కర్‌ని కనుగొన్నదెవరు?
4. వరల్డ్ వైడ్ వెబ్‌ని 1989లో కనిపెట్టినదెవరు?
5. రివాల్వర్‌ని ఎవరు కనుగొన్నారు?
6. ఎయిర్ కండిషన్‌ని కనిపెట్టింది ఎవరు?
7. సేఫ్టీ రేజర్ ఆవిష్కర్త ఎవరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్–35 సమాధానాలు:

1. వశిష్ఠుడు, 2. అగస్త్యుడు, 3. అత్రి, 4. అష్టావక్రుడు,
5. చరకుడు, 6. విశ్వామిత్రుడు

*December'11 Winner: P. Madhumitha, Sai Nagar, Chintal, Hyderabad - 54*

# నవ్వుల పువ్వులు

'మేక పాలు నిన్ను పిల్లాడిగానే ఉంచుతాయిరా,' గోపీ తల్లి అతడిచేత పాలు తాపించడానికి ప్రయత్నిస్తూ చెప్పింది.

'అవునా, అదెలా సాధ్యం?' ప్రశ్నించాడు గోపీ. 'నాలుగేళ్ల మేకకే గడ్డం ఉండటం నేను చూశానే.'





సోము : 'నాన్నా! నీకు మంచి వార్త తీసుకొచ్చాను.'

'ఏమిటది?' అడిగారు నాన్న.

సోము : 'నేను పాసయితే నాకు సైకిల్ కొనిపెడతానని చెప్పావు కదా! ఆ ఖర్చు నీకు ఈ సంవత్సరం తగ్గించానులే.'

దంపతులిద్దరూ హోటల్ గదిలోకి అడుగుపెట్టారు. భార్య విద్యుద్దీపం వెలిగించి, గదిలో ఒక ఎలుక తారాడుతూండటం గమనించింది.

ఆమె భర్త హోటల్ రిసెప్షన్‌కు ఫోన్ చేసి 'మా గదిలో ఎలుక ఉంది' అని ఆరోపించాడు.

'దాన్ని వెంటనే కిందికి పంపించండి,' రిసెప్షనిస్ట్ చెప్పాడు. 'దాని పేరు నమోదు చేయాలి మరి.'





'నా కుమారుడు చాలా తెలివైనవాడు. అతడివన్నీ కొత్త ఆలోచనలే. మీకు కనిపించలేదా?'

'అవును స్పెల్లింగులు చెప్పేటప్పుడు అవి బయటపడుతుంటాయి లెండి.'

# తినుబండారాలు.. మరిన్ని తినుబండారాలు





చరిత్రలో తొలి పీ ని ఈజిప్ట్ వాసులు కనిపెట్టారని భావించబడుతోంది. పీ అంటే మాంసం, పిండి మొదలగువాటిని లోపల ఉంచి లేదా పైన పిండి పూత పూసి కాల్చిన తినుబండారం. దీన్ని తీపి పెచ్చులు అని కూడా అంటారు. వారు బ్రెడ్‌లో గింజలు, తేనె, పండ్లు వంటి వాటిని కలిపి ఆవిరిపై ఉడికించేవారు! 14వ శతాబ్దంలో తయారు చేసిన తీపి పెచ్చుల్లో చక్కెర ఉండేది కాదని మీకు తెలుసా? వీటిని అప్పట్లో కాఫిన్‌లు అనేవారు అంటే వీటిని కంటైనర్లుగా మాత్రమే ఉపయోగించేవారు. ఆ కాలంలో చక్కెర లభ్యమవుతున్నప్పటికీ చాలా తక్కువ పరిమాణంలో దొరికేది, చాలా ఖర్చుతో కూడుకుని ఉండేది.



మధ్య యుగాల్లో, తీపి పెచ్చులు అత్యంత రుచికరంగా ఉండటమే కాకుండా వినోద సాధనంగా కూడా ఉండేవి. వీటిని ఎంత సొగసుగా తయారు చేసేవారంటే వాటిని కట్ చేసినప్పుడు, పక్షులు వాటిపై వాలేవి. ఇది అతిథులకు ఆహ్లాదం కలిగించేదట!



17వ శతాబ్దంలో, 1వ చార్లెస్ రాజు, హెన్రిట్టా రాణి గౌరవార్థం ఒక విందు ఏర్పర్చారు. దానికోసం భారీస్థాయిలో పిండి ముద్ద పొరతో పీని కప్పి ఉంచి తీసుకొచ్చారు. రాణి దాన్ని కట్ చేసేముందు సైనిక కవచం ధరించిన మరుగుజ్జు ఆ పిండి పొరలోంచి బయటకు వచ్చి వారికి అభివాదం చేశాడు.



మార్క్ ట్వైన్ ఈ తీపి పెచ్చులంటే చెవికోసుకునేవాడు. అతడి స్నేహితురాలు, హౌస్ కీపర్ అయిన కేటీ లీరే అతడి కోసం పొట్టి బెర్రీ పండ్లతో పెచ్చులను తయారుచేసి పెట్టేది. దాంతో భోంచేయకుండానే బయటకు వెళ్లిపోయే అతడి అలవాటుకు భంగమయ్యేది.



పీ లంటే చెవికోసుకునే మరో గొప్ప అభిమాని జేమ్స్ బుచానన్ బ్రాడీ. ఇతడు చరిత్రలో పేరుమోసిన తిండిపోతు. బ్రాడీ భోజనాల బల్లకు ఆరు అంగుళాల దూరంలో కూర్చుని తీపి పెచ్చులను తినడం ప్రారంభించేవాడు. అతడి పొట్ట బాగా ఉబ్బిపోయి బల్లముందుకు సాగి ఇబ్బంది పెట్టినప్పుడు మాత్రమే అతడు తినటం ఆపి వెళ్లేవాడట!




షూఫ్లై అనేది బెల్లపు పాకం, ముడిచక్కెర నుంచి తయారు చేసిన తీపి పదార్థం. షూఫ్లైకి ఆ పేరు ఎలా వచ్చింది? దీన్ని బెల్లపు పాకం వాడి తయారు చేసినందున సాధారణంగా ఇది ఈగలను పెద్ద ఎత్తున ఆకర్షించింది. పైగా ఆ ఈగలను పారదోలడానికి వంటమనుషులు షూ, షూ అని పదే పదే అదిలించేవారట. అందుకే వీటికి షూఫ్లై పీ అని పేరు స్థిరపడిపోయింది.



మిన్స్ పీస్ అనేవి రైసిన్ వంటి ఎండబెట్టిన పండ్లతో తయారు చేయబడతాయి. వీటిలో ఒక్కోసారి మాంసం కూడా వాడతారు. వీటిని సాంప్రదాయకంగా క్రిస్‌మస్, నూతన సంవత్సర వేడుకల సందర్భంగా ఆరగిస్తారు. వీటిని క్రిస్మస్ తాతకు చాలా ఇష్టమైన ఆహారంగా పరిగణిస్తారు. పిల్లలు కూడా చిమ్నీ అడుగుభాగం వద్ద మిన్స్ పీలను ఒక పళ్లెంలో వదిలి వెళుతుంటారు.




క్రీమ్ పీస్‌ని సాంప్రదాయకంగా గుడ్లు, పాలు, మీగడ, పిండి కలిపి తయారు చేస్తుంటారు. క్రీమ్ పీస్‌ని రాజకీయ నిరసన తెలుపడానికి ఆయుధంగా ఉపయోగించేవారు. క్రీమ్ పీస్‌ని బహిరంగంగా ఎవరిమీద అయినా విసిరివేయడం సాధారణంగా కనిపిస్తూంటుంది. దీన్ని పీయింగ్ అనేవారు.



గ్రాస్‌షాపర్ పీస్ అనేవి ఆకుపచ్చ రంగులోని పీస్. వీటిని 1950లో అమెరికాలో కనుగొన్నారు. ఆకాలంలో ప్రాచుర్యంలో ఉన్న గ్రాస్‌షాపర్ అనే ముదురాకు పచ్చరంగులోని మత్తుపానీయం నుండి ఈ పదం పుట్టుకొచ్చింది. 20వ శతాబ్దం ప్రారంభంలో ఫిలిప్పైన్స్‌లోని క్రంచీ పీస్‌ను తయారు చేయడానికి వీటిని ఉపయోగించేవారు.



మనం ఎంతో ఇష్టపడే సమోసా కూడా ఒకరమైన పీ అనే చెప్పవచ్చు. బంగాళాదుంప ముక్కలు, మాంసం, మసాలా దినుసులు మరియు వివిధ రకాల పదార్థాలతో కూడిన వేడి వేడి సమోసా దక్షిణాసియాలో ప్రజాదరణ పొందిన స్నాక్.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల
ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Who waits for that? | I couldn't see. |
|---|---|---|
| Telugu | దానికోసం ఎవరు వేచి ఉంటారు? | నేను చూడలేదు. |
| Hindi | इसके लिये कौन रुकेगा?<br>ఇస్కే లియే కౌన్ రుకెగా? | मैं नहीं देख पाया / पाई।<br>మైన్ నహీన్ దెక్ పాయా / పాయీ. |
| Tamil | யார் அதற்காகக் காத்திருக்கிறார்கள்?<br>యార్ అదర్కాగ కాతిరుక్కిరార్గల్? | என்னால் பார்க்க முடியவில்லை.<br>ఎన్నాల్ పార్క్క ముడియవిల్లయ్. |
| Bengali | তার জন্য কে অপেক্ষা করবে?<br>తార్ జోన్యో కె అపేక్షా కొర్బె? | আমি দেখতে পাই নি।<br>ఆమి దెంటి ఘుమ్ ఫకె ఉథెచ్చి. |
| Marathi | पण तिची वाट कोण बघेल?<br>పన్ తిచీ వట్ కొన్ బఘేల్? | मी बघू शकलो/शकले नाही.<br>మీ బఘు షకలో / షకలె నహీ. |
| Kannada | ಅದಕ್ಕೆ ಯಾರು ಕಾಯುತ್ತಾರೆ?<br>అదక్కె యారు కాయుత్తారె? | ನನಗೆ ನೋಡಲಾಗಲಿಲ್ಲ.<br>ననగె నోడలాగలిల్ల. |
| Oriya | କିଏ ସେଥିପାଇଁ ଅପେକ୍ଷା କରିଛନ୍ତି?<br>కియే సెతిపయెన్ అపేక్ష్యా కరిచ్ఛంతి? | ମୁଁ ଦେଖିପାରି ନ ଥିଲି।<br>మున్ దెఖిపరి న థిలి. |
| Gujarati | તેની કોણ રાહ જુએ છે.<br>తెనా కొణ రాహ జ్యు చ్చె. | હું જોઈ શક્યો/શકી નહીં.<br>హున్ జొయే షక్యో / షకే నహీన్. |
| Assamese | তালৈ কোন ৰৈ থাকে?<br>తాలోయ్ కున్ రోయి థాకె? | মই দেখা পোৱা নাই।<br>మొయి దేఖా హువ నాయి. |
| Malayalam | അതിന് ആര് കാത്തുനിൽക്കും?<br>అథిను అరు కథునిక్కుమ్? | എനിക്ക് കാണാൻ കഴിഞ്ഞില്ല.<br>ఎనిక్కు కనన్ కళినిల్లా. |
| Santali | ᱚᱱᱟ ᱚᱠᱚᱭ ᱛᱟᱝᱜᱤ ᱟᱠᱟᱫ-ᱟ?<br>ఓన ఒకోయ్ తంగి అకాడ్ – ఎ? | ᱵᱟᱹᱱᱩᱡ ᱧᱮᱞ ᱫᱟᱲᱮ ᱟᱫᱮᱭᱟ।<br>బాన్జి నెల్ దలె అడెయా. |
| Sanskrit | तदर्थं क: प्रतीक्षते?<br>తదర్థమ్ కః ప్రతీక్షతే. | अहं द्रष्टुं न शक्तवान्/ शक्तवती।<br>అహమ్ ద్రష్టుమ్ న శక్తవాన్/శక్తవతీ. |



| English | I woke up late. | I couldn't get the bus. |
|---|---|---|
| Telugu | నేను ఆలస్యంగా నిద్రలేచాను. | నేను బస్సు అందుకోలేకపోయాను. |
| Hindi | मैं देर से उठा / उठी।<br>మైన్ దెర్ సె ఉఠా / ఉఠీ. | मुझे बस नहीं मिली।<br>ముజె బస్ నహీన్ మిలీ. |
| Tamil | நான் தாமதமாகக் கண் விழித்தேன்.<br>నాన్ తామదమాగ కణ్ విళిత్తేన్. | எனக்கு பஸ் கிடைக்கவில்லை.<br>ఎనక్కు బస్ కిడైక్క విల్లయ్. |
| Bengali | আমি দেরীতে ঘুম থেকে উঠেছি।<br>ఆమి డెరిటె ఘుమ్ థెక ఉఠెచ్చి | আমি বাসটা ধরতে পারিনি।<br>ఆమి బస్ టా ధోర్ఛె పారిని |
| Marathi | मी उशिरा उठलो/उठले.<br>మి ఉషిర ఉఠలో / ఉఠలె | मला ती बस मिळू शकली नाही.<br>మల తి బస్ మిలు షకలి నహి. |
| Kannada | ನಾನು ತಡವಾಗಿ ಎದ್ದೆ.<br>నాను తడవాగి ఎద్దె. | ನನಗೆ ಬಸ್ಸು ಹಿಡಿಯಲಾಗಲಿಲ್ಲ.<br>ననగె బస్సు హిడియలాగలిల్ల. |
| Oriya | ମୁଁ ବିଳମ୍ବରେ ଉଠିଲି।<br>ముఁన్ బిల్మరే ఉఠిలి. | ମୁଁ ବସ୍ ପାଇପାରିଲି ନାହିଁ।<br>ముఁన్ బస్ పాయ్‌పారిలి నాహిఁన్. |
| Gujarati | હું મોડેથી ઉઠ્યો/ઉઠી.<br>హున్ మొడెథే ఉథ్యో / షకీ నహీన్. | હું બસ મેળવી શક્યો/શકી નહીં.<br>హున్ బస్ మెలవే షక్యో / షకీ నహీన్. |
| Assamese | মই দেৰীকৈ শুই উঠিছিলো ।<br>మోయి దెంకోయి శ్శుయి ఉథిసిలు. | মই বাছখন ধৰিব নোৱাৰিলো ।<br>మోయి భాస్ఖోన్ ధోరిబో నువరిలు. |
| Malayalam | ഞാൻ വൈകിയാണ് എണീറ്റത്.<br>న్జాన్ వైకియను ఎనేట్టతు. | എനിക്ക് ബസ് കിട്ടിയില്ല.<br>ఎనిక్కు బస్ కిట్టియిల్ల. |
| Santali | ᱵᱤᱞᱚᱢ ᱠᱚᱴᱤᱧ ᱵᱮᱨᱮᱫ ᱮᱱᱟ।<br>బిలోమ్ కటింజ్ బెరెడ్ ఎనా. | ᱵᱟᱥ ᱵᱟᱧᱡᱤ ᱧᱟᱢ ᱞᱮᱜ-ᱟ।<br>బస్ బంజి నామ్ లెగ్– ఎ. |
| Sanskrit | अहं विलम्बेन उत्थितवान्/उत्थितवती।<br>అహమ్ విలంబెన ఉత్తితవాన్/ఉత్తితవతీ. | बसयानं प्राप्तुं न शक्तः/शक्ता<br>బసయానమ్ ప్రాప్తుమ్ న శక్తహ/శక్తా. |

## ఫలరాజు



మాంగో అనే పేరు మాంకాయ్ లేదా మాంగాయ్ అనే తమిళ పదం నుంచి పుట్టింది. పోర్చుగీసులు తమిళ పేరును సరిగా పలకలేక దాన్ని 'మాంగా' అని మార్చారు. తర్వాత బ్రిటిష్ వారు దాన్ని 'మాంగో' అని పిలవసాగారు. వీరు దీనిపై పలు ప్రయోగాలు చేసి సంకరజాతి మామిడి రకాలను తీసుకువచ్చారు. మనం ఈరోజు ఎంతో ప్రీతిగా ఆరగిస్తున్న అల్ఫాన్సో లేదా మల్గోబా పండు వీరి కృషి ఫలితమే అని చెప్పాలి. భారతీయులు ఈ పండు గురించి 3000 సంవత్సరాలకు ముందు నుంచి వర్ణిస్తూ వస్తున్నప్పటికీ పాశ్చాత్య ప్రపంచం మాత్రం గత 300 ఏళ్లనుంచి మాత్రమే దాని రుచి చూస్తోంది. బృహదారణ్య పరిషత్‌లో కూడా మామిడి పండు గురించి వర్ణించారు. ప్రాచీన కాలంలో దీన్ని ఆమ్ర, చౌతా, రసాల, సహకార వంటి పలు పదాలతో పిలిచేవారు. పండ్లజాతుల్లో రారాజైన మామిడి పండును పశ్చిమ, దక్షిణ భారతదేశంలోని పలు ప్రాంతాల్లో అదృష్టానికి మారుపేరుగా గుర్తిస్తున్నారు. దుష్టశక్తులను పారదోలేందుకు మామిడి ఆకులను ఇంటి ముందు వాకిలి వద్ద అలంకరిస్తారు. ప్రేమ దేవుడైన మన్మథుడితో మామిడిచెట్టును పోల్చుతుంటారు కూడా.

## పిల్లల స్వప్నం



కేరళలోని వేనాడ్ జిల్లాలో ఉన్న కనవు -స్వప్నం- అనే పేరు గల పాఠశాల విద్య పట్ల సాంప్రదాయిక భావాన్ని తోసిపుచ్చుతోంది. 1993లో 30 మంది పిల్లలతో మొదలైన ఈ పాఠశాలలో ఇప్పుడు 800 మంది పిల్లలు ఉంటున్నారు. వీరు గురుకులంలో నివసిస్తున్నారు. పిల్లలను వారి వయసు, మానసిక సామర్థ్యతల బట్టి ఇక్కడ బృందాలుగా వేరుపరుస్తుంటారు. ఇక్కడ పిల్లల్లో ప్రతి ఒక్కరూ రోజులో కొద్ది గంటలపాటు పొలాల్లో, వంటగదిలో, కుట్టుపనిలో గడపాలి. వీరు కేరళలోని ప్రాచీన యుద్ధవిద్య అయిన కలరిపయిట్టు కూడా నేర్చుకుంటారు. 10, 12 తరగతులకు గాను ఓపెన్ స్కూల్ పరీక్షలకు కూడా పిల్లలు ఉత్సాహంగా పాల్గొంటుంటారు. దీనివల్ల వీరు వివిధ రంగాల్లో ఉద్యోగాలు పొందడానికి సంసిద్ధులై ఉంటారు. కేరళనుంచి మరియు దేశవ్యాప్తంగా కూడా వివిధ రంగాలనుంచి ప్రముఖకవులు, రచయితలు, విద్యావేత్తలు, సంగీతకారులు మరియు నిపుణులు కనవు పాఠశాలను నిత్యం సందర్శిస్తూ పిల్లలకు వివిధ నైపుణ్యాలను, కళా రూపాలను బోధిస్తుంటారు. సాంప్రదాయేతర స్వభావంతో కూడిన ఈ విద్యాబోధనా పద్ధతి బాగా ప్రాచుర్యంలోకి వస్తోంది.

## విదూషకుడు

## బీర్బల్



# సత్యం - అసత్యం



1. ఒక రోజు, అక్బర్ చింతాక్రాంతుడై ఉండటం బీర్బల్ గమనించాడు. చక్రవర్తికి అతడు అభివాదం చేసి మాట్లాడటానికి వేచి ఉన్నాడు. అక్బర్ విచారానికి కారణమేమిటా అని అతడు యోచించసాగాడు.



2. అక్బర్ అతడివైపు తిరిగాడు. 'బీర్బల్ నాకు ఈ విషయం చెప్పు. సత్యానికి, అసత్యానికి మధ్య వ్యత్యాసమేమిటి?' బీర్బల్ ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు.



3. ఒక్క క్షణంలోనే అతడు తేరుకుని సమాధాన మిచ్చాడు. 'నాలుగు అంగుళాలు జహాపనా!' చక్రవర్తి తను విన్నది నమ్మలేకపోయాడు. 'ఏమన్నావ్!' అని గద్దించాడు.



4. చక్రవర్తికి ఆగ్రహం వచ్చింది. 'చెత్త సమాధానం..! నేను ఒక ఒక చిక్కు ప్రశ్నను అడుగుతుంటే నీవు పరాచికాలు ఆడుతున్నావు.అవునా?' అన్నాడు. బీర్బల్ దానికీ సమాధానం చెప్పలేదు.



5. బీర్బల్ సమర్థించుకున్నాడు. 'నేను పరాచకాలాడలేదు జహాపనా! తేడా కేవలం నాలుగు అంగుళాలే మరి. నేనన్న మాటకు కట్టుబడి ఉంటాను.'



6. అక్బర్‌కి ఇప్పటికీ కోపం తగ్గలేదు. 'ఏమంటున్నావ్ బీర్బల్? సులభంగా తప్పించుకోగలనని తలవకు!' అన్నాడు. బీర్బల్ సమాధానమిస్తూ, 'నన్ను వివరించనీయండి జహాపనా,' అన్నాడు.



7. 'నా కళ్ళతో నేను చూసిందంతా సత్యం. నా చెవులతో నేను విన్నదంతా అసత్యం. నా అభిప్రాయం ఇదే ప్రభూ!' అన్నాడు బీర్బల్. చక్రవర్తి సందిగ్ధంలో పడ్డాడు.



8. 'నాలుగు అంగుళాలు అని నీవెలా చెప్పగలవు?' అక్బర్ ప్రశ్నించాడు. 'నా కళ్లకు, చెవులకు మధ్య దూరం ఇదే జహాపనా!' సమాధానమిచ్చాడు బీర్బల్.



9. అక్బర్‌కు బీర్బల్ వివరణలోని సత్యం బోధపడింది. 'నేను ఈ విషయం ఆలోచించనేలేదు బీర్బల్! హాహాహా!' పెద్దగా నవ్వాడు చక్రవర్తి. 'ఇది చాలా సులభం ప్రభూ!' సమాధానమిచ్చాడు బీర్బల్ తుడుముకోకుండా.

నీటికి కొన్ని విశిష్ట లక్షణాలున్నాయి. నీరు సున్న సెంటీగ్రేడ్ డిగ్రీల ఉష్ణోగ్రత వద్ద మంచుగడ్డగా మారుతుంది. అయితే ప్రవహిస్తున్న నీరు ఈ ఉష్ణోగ్రత వద్ద కూడా గడ్డ కట్టదు. ఎందుకంటే వేగంగా పారుతున్న నీటిలో గాలి అధికంగా ఉంటుంది. ఇది నీరు గడ్డ కట్టే స్థితిని తగ్గిస్తుంది. మంచు స్పటికాలు ఏర్పడుతున్నప్పుడే పారుతున్న నీరు వాటిని విడగొడుతుంది. పైగా పారుతున్న నీటిలో తయారయ్యే శక్తి, నీరు దాని ద్రవ రూపాన్ని నిలుపుకునేలా చేస్తుంది.

మీరు గమనించే ఉంటారు, ఫ్రిజ్‌లో మీరు ఉంచిన నీరు ఎక్కడికీ ప్రవహించకున్నప్పటికీ చల్లబడుతుంది కాని గడ్డ కట్టదు. ఎందుకంటే ఫ్రిజ్ లోని ఉష్ణోగ్రత నియంత్రించబడుతుంది, ఇది ఎన్నటికీ సున్నా డిగ్రీలకు చేరదు. ఈ నీటినే ఫ్రిజ్‌లోని గడ్డకట్టించే విభాగం(ఫ్రీజర్ బాక్స్)లో ఉంచితే ఆ నీరు గడ్డ కడుతుంది. కారణం ఈ ఫ్రీజర్ బాక్స్‌లో ఉష్ణోగ్రత చాలా తక్కువగా ఉంటుంది.

# ఉత్తరభారత సుప్రసిద్ధ కట్టడాలు

ఈ నెల ఉత్తర భారతదేశంలోని కొన్ని సుప్రసిద్ధ కట్టడాల చిత్రాలతో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము.



రంగమహల్, హిమాచల్ ప్రదేశ్



హరిప్రభాత్ కోట, కాశ్మీర్



హవా మహల్, రాజస్థాన్



స్వర్ణ దేవాలయం, పంజాబ్



బద్రీనాథ్ ఆలయం, ఉత్తరాంచల్



ఎర్రకోట, కొత్త ఢిల్లీ

